# పిల్లలలో చాలమంది అవసరమైనన్ని పాలు తాగరు



# అందుకే వారికి కావాలి కాల్షియం-శాండోజ్® బిళ్ళలు

**భారతదేశంలో చాలమంది పిల్లలలో కాల్షియం కొరత ఉంది**

మరి, మీ పిల్లలలో కూడానా ? మీ పిల్లలకు కావలసిన కాల్షియం పోషణ వారి పళ్ళకూ, ఎముకలకూ లభిస్తోందా అన్నది మీరే చూసి చెప్పగలరు. వారిలో అందరూ రోజుకు చెరో 3 పెద్ద గ్లాసుల పాలు తాగుతున్నారా? లేదు! అయితే వారికి కాల్షియం-శాండోజ్ బిళ్ళలు తప్పని సరిగా కావలసిందే.

కాల్షియం-శాండోజ్ గట్టిపళ్ళు, దృఢమైన ఎముకలు పెంపొందేందుకు తోడ్పడుతుంది. విటమిన్ సి, డి, బి12 తో బలపరచబడి, రాస్ప్‌బెర్రీ రుచిగల కాల్షియం-శాండోజ్ బిళ్ళలు బలే రుచికరమైనవి. పిల్లలు అవంటే ముచ్చట పడతారు.

కాల్షియం-శాండోజ్ — ప్రపంచంలో మేలైన కాల్షియం స్విటర్‌లెండ్ లోని శాండోజ్ వారు రూపొందించినది.



మీ పిల్లలకు రోజూ కనీసం 4 కాల్షియం-శాండోజ్ బిళ్ళలు కావాలి 2 బిళ్ళలు ప్రతిసారి భోంచేసే ముందు



# కాల్షియం-శాండోజ్®

## గట్టి పళ్ళు, పటిష్టమైన ఎముకలకోసం



# చందమామ

ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు



ఇవిగాక అమరవాణి, కథాశీర్షిక పోటీ, ఫొటో వ్యాఖ్యలూ వగైరా.


Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI. CHANDAMAMA is published monthly and distributed in U.S.A. by Chandamama Distributors, West Chester PA 19380, Subscription 1 year $ 6-50. Second Class Postage paid at West Chester, PA.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

మనిషిలో తరచుగా రెండు విరుద్ధశక్తుల మధ్య సంఘర్షణ ఏర్పడుతుంది. ఆ సమస్యను మనిషి ఎలా పరిష్కరించుకుంటాడనేది వాడి నైతిక, ధార్మిక విశ్వాసాల బలంపై ఆధారపడుతుంది. తమ స్వార్థాన్ని త్యాగంచేసి, ఆదర్శాలను నిలుపుకో గలవాళ్ళు ఉత్తమపురుషులు; ఆదర్శాలకు స్వస్తి చెప్పి, స్వార్థాన్ని దక్కించుకునేవాళ్లు చాలా సాదా మనుషులు. ఇదే నీతి మనకు ఈ నెల బేతాళకథ ''మార్పు'' లో కనబడుతుంది. ఇందులో నాగపాలుడు తన పవిత్రవిశ్వాసం కోసం సులోచన మీది ప్రేమను త్యాగం చేస్తాడు.

సంపుటి 61 జూలై '77 సంచిక 1

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






గుణవాన్వా పరజనః,
స్వజనో నిర్గుణోపి వా,
నిర్గుణ స్స్వజన శ్శ్రేయా
న్యః పరః పరఏవ సః. 1

[ఇతరులు గుణవంతులూ, అయినవారు గుణహీనులూ అయినప్పటికీ, అయినవారినే ఆశ్రయించాలి. ఎందుకంటే పరాయివాడు పరాయివాడే.]

య స్స్వపక్షం పరిత్యజ్య
పరపక్షం నిషేవతే,
స స్వపక్షే క్షయంప్రాప్తే
పశ్చాత్ తైరేవ హన్యతే. 2

[ఎవడు తనవార్ని వదిలి పరుల పంచ చేరుతాడో వాడు, తనవారు నశించిన తరవాత పరుల చేతనే చంపబడతాడు.]

శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః,
పరధర్మో భయావహః. 3

[మేలైన పరధర్మం కంటె గుణహీనమైన స్వధర్మం మేలు. స్వధర్మం కోసం చావవచ్చు గాని, పరధర్మం భయంకరమైనది.]

స్వ, పర భేదం




## 49

కాకి అక్కడ సమావేశమైన పక్షులకు, "చంద్రసరస్సు" కథ చెప్పి, "విన్నారు గదా, బలవంతుడైన నాయకుడు రక్షగా వున్నాడని తెలిస్తేనే, శత్రువులు ఎలా హడలెత్తి పారిపోతారో? తెలివితేటలూ, వివేకం గల యింతమంది మీరిక్కడ చేరి, వికారాకారం, నీచబుద్ధీ గల యీ గుడ్లగూబను రాజుగా ఎన్నుకోవటం వింతగా వుంది. నిజంగా శత్రువుల నుంచి మనకు ప్రమాదం సంభవిస్తే, యీ గుడ్లగూబ మనను రక్షించగలదని మీరు నమ్ముతున్నారా?" అని అడిగింది.

"నువ్వు వచ్చేవరకూ అలాగే నమ్మాం. కాని, నువు చెప్పినది విన్న తరవాత మా అందరికీ గుడ్లగూబ శక్తి సామర్థ్యాల మీద శంక కలుగుతున్నది." అన్నవి పక్షులు.

"ఛీ, ఛీ! యింకా మీకు యీ లేకి జాతి గుడ్లగూబ అంటే అసహ్యం కలిగినట్టు లేదు. ఇలాంటిది మనకు రాజయితే, మన పక్షిజాతే సర్వనాశనం అయిపోయే ప్రమాదం వున్నది. ఇలాంటి తుచ్ఛుల దగ్గిర న్యాయం కోరి పోయిన కుందేలూ, కౌజుపిట్టా నా కళ్ళ ఎదటనే ఘోర మరణం పాలవటం నే నెరుగుదును," అన్నది కాకి.

"ఏమిటా కథ?" అని పక్షులు కాకిని అడిగాయి.

కాకి వాటికి కుందేలూ, కౌజుపిట్టల కథ యిలా చెప్పింది:

కొంతకాలం క్రితం నేనొక నదీతీరంలోని చెట్టు మీద నివసిస్తూండేదాన్ని. ఆ చెట్టు కింది భాగంలో వున్న ఒక తొర్రలో ఒక కౌజుపిట్ట వుంటూండేది.




ఇద్దరం ఒకే చెట్టును ఆశ్రయించి వుండటం వల్ల, మా ఇద్దరి మధ్యా మంచి స్నేహం ఏర్పడింది. పగలల్లా అరణ్యంలో ఆహారం వెతుక్కొని, చీకటి పడేవేళ మా నివాసం అయిన చెట్టును చేరగానే, ఒకళ్లకొకళ్లం, ఆ నాటి అనుభవాలను గురించి చెప్పుకునేవాళ్లం.

ఇలా వుండగా ఒకనాడు ఉదయమే ఆహారం కోసం అరణ్యంలోకి పోయిన కౌజుపిట్ట, రాత్రి పొద్దుపోయినా తిరిగి రాలేదు. దానికి ఏదో ప్రమాదం జరిగి వుంటుందని నేను భయపడ్డాను. అరణ్యంలో మనలాంటి సన్నకారు జీవాలకు అన్నీ ప్రమాదాలే కద! కౌజుపిట్ట ఏ బోయవాడి వలలోనే చిక్కిందేమో! ఏ నక్కో, తోడేలో హఠాత్తుగా మీదపడి ప్రాణాలు బలిగొన్నవేమో!

నా ప్రియమిత్రుడి కోసం కొన్ని రోజుల పాటు ఆ చుట్టుపక్కల అంతా గాలించాను. కాని ఎక్కడా జాడ కనిపించలేదు. కొద్ది రోజుల తరవాత ఒక కుందేలు నేనుండే చెట్టు దగ్గిరకు వచ్చి, లోగడ కౌజుపిట్ట నివసించిన తొర్రలో ప్రవేశించింది. దాని పేరు శీఘ్రగుడు.

నా మిత్రుడి నివాసాన్ని ఆక్రమించిన యీ కుందేలును గట్టిగా కొప్పడి, అక్కడి నుంచి పంపేద్దామనుకున్నాను. కాని, కౌజుపిట్ట యింకా బతికి వుంటుందన్న ఆశ నాకు లేదు. అందువల్ల కుందేలు శీఘ్రగుణ్ణి ఏమీ అనకుండా వూరుకున్నాను.

ఈ లోకంలో ప్రాణులు తమ జీవిత గమనంలో ఎన్ని అద్భుతాలను చూడవలసి వస్తుంది! మరణించి వుంటుందని ఆశ వదులుకున్న కౌజుపిట్ట ఒకనాడు హఠాత్తుగా తిరిగి వచ్చింది. ఇప్పుడది లోగడకన్న చాలా దృఢంగా వున్నది; శరీరం మీద ఈకలు నిగనిగ మెరుస్తున్నాయి. ఇంతకాలంగా ఎక్కడో ఆహార సమృద్ధి వున్న చోట కడుపారా తింటూ కాలం గడిపి వుంటుంది.

కౌజుపిట్ట వస్తూనే తన తొర్రను ఆక్రమించిన కుందేలు శీఘ్రగుణ్ణి చూసి మండిపడి, ఘాటైన మాటలతో నానా తిట్లూ తిట్టి, ''ఏయ్, కుందేలూ! నేను ఇంట లేనప్పుడు వచ్చి, నా నివాసస్థానాన్ని ఆక్రమించటం ఒట్టి బుద్ధితక్కువ పని. మంచిగా చెబుతున్నాను, తక్షణం యిక్కణ్ణించి వెళ్లిపో!'' అన్నది.

కౌజుపిట్ట మాటలకు కుందేలు పకపకా నవ్వి, ''నువ్వేదో మందమతిలా వున్నావు. పూర్వం ఎన్నడో కొన్నాళ్ళపాటు ఒక ఇంట వున్నంత మాత్రానే, ఆ ఇల్లు శాశ్వతంగా నీ సొంతం కాదు. ఈ అతి స్వల్ప విషయం కూడా తెలియదా?'' అన్నది.

కౌజుపిట్ట యీ సారి మరింతగా మండి పడుతూ, ''ఓయ్, బుద్ధిహీనుడా, నాకే ధర్మసూక్ష్మలు బోధిస్తున్నావా? నాకూ అంతో యింతో ధర్మశాస్త్రజ్ఞానం లేక పోలేదు. ఇళ్ళూ, బావులూ, తోటలూ— ఇలాంటివాటి విషయమై తగువు వచ్చినప్పుడు, అవి ఎవరికి న్యాయంగా చెందాలో తేల్చి చెప్పేందుకు, ఇరుగు పొరుగున నివసించేవాళ్ల సాక్ష్యం ఒక్కటే ఆధారమని ధర్మశాస్త్రం తెలిసిన వాళ్ళు చెపుతారు. నువ్విప్పుడాక్రమించిన నా నివాసం గురించి, సాక్షులను పిలిచి, న్యాయం అడుగుదామా?'' అన్నది.

కుందేలు శీఘ్రగుడు ఈసడిస్తున్నట్టు ముఖంపెట్టి, చెవులాడించి, ''మనిద్దరికీ తెలిసిన ధర్మశాస్త్రజ్ఞానాల మధ్య ఏదో పెద్ద అంతరం వున్నట్టున్నది. ఒకసారి వదిలిపోయిన నివాసస్థానం తిరిగి నాదే అని చెప్పే హక్కు ఎవరికీ లేదు. మనుషుల మాట నాకు బాగా తెలియదు గాని, మనబోటి అధమజాతి జీవుల హక్కు భుక్తాల గురించి, ధర్మశాస్త్రం తెలిసిన వారు ఏమి చెపుతారో నాకు బాగా తెలుసు. మనం నివసించే గృహంలో పిల్లలను కని, పెద్ద చేసేవరకే మనకా గృహం మీద హక్కు వుంటుంది. తరవాత దాన్ని ఎవరైనా ఆక్రమించుకోవచ్చు,'' అన్నది.



# 187. వెర్రి వెయ్యి విధాలు

**1886**లో ఆత్మహత్య చేసుకున్న రెండవ లుడ్విగ్ రాజును యూరప్ వెర్రివాడి కింద పరిగణించింది. అతను తన రాజ్యంలోని కొండ ప్రాంతంలో అనేక కోటలు కట్టించాడు. వాటిలో చాలా అందమైన కట్టడం "న్యూష్వాన్ స్టయిన్". ఆస్ట్రియా సరిహద్దుకు సమీపంలో ఉన్న ఈ కోట చలవరాతితో **1869-86** మధ్య నిర్మాణమయింది. ఎక్కటానికి దుస్సాధ్యమైన కొండశిఖరాన దీని నిర్మాణం జరిగింది.





# మాయాసరోవరం

## 19

[నరవానరం ఎత్తుకుపోయిన తన తమ్ముణ్ణి వెతుకుతూ బయలుదేరిన సర్పనఖుడు, జయశీల సిద్ధసాధకులకు ఒక చెట్టు కింద కనిపించాడు. వాళ్ళు అతణ్ణి పట్టుకుని, మాయా సరోవరానికి వెళ్ళే దారి చెప్పకపోతే చంపుతామని భయపెడుతూండగా, కృపాణజిత్తు ఒక జలాశ్వాన్ని ఎక్కి, కత్తి తిప్పుతూ వాళ్ళున్న వైపుకు రాసాగాడు. తరవాత—]

కృపాణజిత్తు పెట్టిన కేక వింటూనే జయశీలుడు కత్తిని సర్పనఖుడి తల మీది నుంచి పైకెత్తి, తల తిప్పి చూశాడు. కృపాణజిత్తు చాలా దూరంలో, జలాశ్వం మీద అతడికి కనిపించాడు. సిద్ధసాధకుడు శూలాన్ని గుప్పెటలో గట్టిగా బిగించి, "అహాఁ, ఎంత కాలానికి యీ కృపాణజిత్తు నా శూలం పోటుకు అందబోతున్నాడు!" అంటూ బయలుదేరాడు.

సర్పనఖుడు చప్పున పోయి సిద్ధసాధకుడి చేయిపట్టుకుని, "అయ్యా, ఆగండి. ఒక్కమాట! మరొకసారి ధృవపరుచుకునేందుకు అడుగుతున్నాను. ఈ కృపాణజిత్తు అనేవాడే గదా, భయంకర నరవానరానికి యజమాని?" అని అడిగాడు.

"అవును, ఆ నరవానరమే, నీతమ్ముణ్ణి ఎత్తుకుపోయింది." అన్నాడు సిద్ధసాధకుడు.



గింది. సర్పనఖుణ్ణి మంచి చేసుకోవ టానికి యిది చక్కని అవకాశంగా అతడికి తోచింది.

''సర్పనఖా! మాయాసరోవరం ఎక్కడ వున్నదో చెప్పేందుకు నువ్వు నిరాకరించినా, నీ తమ్ముడు సర్పస్వరుణ్ణి వెతికే పనిలో నేను సహాయపడదలిచాను. నేనూ, సాధకుడూ ఆ చెట్లచాటుకు పోయి నిలబడతాం. నువ్వు, కృపాణజిత్తును కేక వేసి పిలిచి, నరవానరం, నీ తమ్ముడూ ఎక్కడ వున్నారో కనుక్కో,'' అన్నాడు జయశీలుడు.

''అయ్యా, కృతజ్ఞుణ్ణి. నా వాహనాన్నీ, కత్తినీ ఉపయోగించుకోవచ్చా?'' అని అడిగాడు సర్పనఖుడు.

జయశీలుడు కత్తిని సర్పనఖుడికి తిరిగి యిచ్చివేస్తూ, ''ఆ కృపాణజిత్తు కత్తి యుద్ధంలో ఆరితేరినవాడు, తగు జాగ్రత్తలో వుండు,'' అని సాధకుడితో కలిసి, కొంచెం ఎడంలో వున్న గుబురు చెట్ల చాటుకు వెళ్ళాడు.

సర్పనఖుడు తన జలాశ్వాన్ని ఎక్కి కూర్చున్నాడు. కృపాణజిత్తు యింకా కేకలు వేస్తూ, అరణ్య వృక్షాల్లో అక్కడా యిక్కడా వెతుకుతూ జలాశ్వం మీద స్వారి చేస్తున్నాడు. సర్పనఖుడు ఒక క్షణం ఆలోచించి తానే పోయి ఆ కృపాణ

''అలా అయితే, యీ దుష్టుణ్ణి చంపే ముందు, ఆ నరవానరం నా తమ్ముణ్ణి అరణ్యంలో ఎక్కడికి ఎత్తుకుపోయిందో వీణ్ణుంచి తెలుసుకోనివ్వండి,'' అన్నాడు సర్పనఖుడు.

''ఛీ, చెయ్యి వదులు! నీ తమ్ముడు ఏమయితే నాకేం! వీడు ముఖ్యంగా జయశీలుడికీ, నాకూ ప్రబల శత్రువు. వీణ్ణి యీ లోకం నుంచి మరో లోకానికి పంపాలి. ఆ తరవాత నీ వంతు వస్తుంది. జాగ్రత్త!'' అంటూ సిద్ధసాధకుడు పళ్ళు కొరికాడు.

వాళ్ళిద్దరి సంభాషణా వింటున్న జయశీలుడికి హఠాత్తుగా ఒక ఆలోచన కలి

జిత్తును కలుసుకోవటం మంచిదని అశ్వాన్ని అదలించబోయేంతలో, అతడి వెన్నుమీద ఏదో గుచ్చుకుని, చురుక్కు మన్నది.

సర్పనఖుడు అశ్వం మీద అదిరిపడి, కత్తి పైకెత్తి వెనుదిరిగిచూశాడు. అతడికి గొర్రెపొటేలు మీద కూర్చునివున్న మరుగుజ్జు సేనాని కనిపించాడు. అతడి చేతిలో బల్లెం వున్నది.

"ఒరే, మరుగుజ్జు జాతి వెధవా, నువ్వేనా నన్ను బల్లెంతో వెన్నులో పొడిచింది?" అంటూ సర్పనఖుడు కోపంతో ఊగిపోతూ, మరుగుజ్జు సేనానిని ప్రశ్నించాడు.



ఆ ప్రశ్నకు మరుగుజ్జు సేనాని నవ్వి, "ఓయ్, నీటి గుర్రం మనిషీ, నేను నిజంగా బల్లెంతో పొడిచి వున్నట్టయితే నువ్వీపాటికి నేలమీద పడి, దొర్లుతూండే వాడివి. నిన్ను పలకరించేందుకు బల్లెంతో నీ వెన్ను మీద అలా గీరాను, అంతే," అన్నాడు.

"నన్ను పలకరించటానికి అదా పద్ధతి? ఛీ," అంటూ సర్పనఖుడు అశ్వాన్ని ముందుకు నడపబోయినవాడల్లా ఆగి, "నాతో నీకేం పని? నేను సర్వశక్తి సంపన్నుడైన మాయాసరోవరేశ్వరుడి బంటును: నువ్వు యీ కీకారణ్యంలో బతికే నేలబారు మనుషుల్లో ఒకడివి," అన్నాడు.

ఆ మాటలకు మరుగుజ్జు సేనాని కోపం తెచ్చుకుని బల్లెం ఎత్తబోయేంతలో, కృపాణజిత్తు జలాశ్వం మీద చెట్ల చాటు నుంచి బయిటికి వస్తూ, సర్పనఖుణ్ణి చూసి ఆగి, "ఎవరు నువు? గడెకొండ గూడెంలో నా మెడకు తాడు బిగించిన వాడివా?" అన్నాడు.

"అవును, ఆ ఉరితాడు నుంచి నువ్వు ఎలా బయటపడ్డావో నాకు తెలియటం లేదు. పైగా నువ్వు యిప్పుడు ఎక్కి వున్న జలాశ్వం నా తమ్ముడైన సర్పస్వరుడిది. వాణ్ణి ఏం చేశావు?" అంటూ



సర్పనఖుడు తన గుర్రాన్ని నెమ్మదిగా, కృపాణజిత్తు కేసి నడపసాగాడు.

కృపాణజిత్తు రెండు చేతులూ పైకెత్తి, "నువ్వు వున్న చోటునే ఆగు. మనం మాట్లాడవలసింది చాలా వుంది," అన్నాడు.

సర్పనఖుడు జలాశ్వాన్ని ఆపి, "ఏమిటా మాట్లాడవలసింది? నా తమ్ముడెక్కడ?" అని అడిగాడు.

"నరవానరం హఠాత్తుగా పైనపడి జలాశ్వం మీదినుంచి నీ తమ్ముణ్ణి ఎత్తుకు పోతూండగా, అతను, 'అన్నా సర్పనఖా!' అంటూ అరవటం నేను విన్నాను. నీ పేరు సర్పనఖు డన్నమాట! నే ఎక్కి వున్న యీ గుర్రం నీ తమ్ముడిది; దీన్ని గూడెం పక్క చెట్లలో పట్టుకున్నాను," అన్నాడు కృపాణజిత్తు.

"నే నడిగినదానికి మాత్రం జవాబివ్వ లేదు, నా తమ్ముడెక్కడ?" అంటూ సర్పనఖుడు కత్తి పైకెత్తాడు.

"సర్పనఖా, తొందరపడకు. విధి బలీయం అన్నారు. నీ తమ్ముడికి ఆ నర వానరం చేతిలో చావు రాసిపెట్టి వుంటే—ఈ పాటికి అంతే జరిగి వుంటుంది. అలా కానప్పుడు అతడు నరవానరాన్ని లొంగ దీసుకుని, దాని సాయంతో, మనిద్దరి శత్రువులైన జయశీల, సిద్ధసాధకుల్ని వేటాడేందుకు అరణ్యమంతా గాలిస్తూం టాడు! నీ తోటివాడైన మకరకేతుణ్ణి, వాళ్ళిద్దరూ ఎంతగా హింసపెట్టారో, అరణ్యంలోని పల్లెవాసుల ద్వారా లోగడ నేను విని వున్నాను," అన్నాడు కృపాణజిత్తు.

కృపాణజిత్తు మాట ముగించే లోపలే సర్పనఖుడు పెద్దగా అరిచి, "దుర్మార్గుడా, నా తమ్ముడి చావుకు కారణం నువ్వు. ఇతర శత్రువుల మాట తరవాత చూస్తాను; ముందు నీ తల నరికి, నా తమ్ముడి ఆత్మకు శాంతి చేయాలి," అంటూ కేకపెట్టి, అశ్వాన్ని కత్తిపిడితో గట్టిగా కొట్టాడు.



జలాశ్వం వేగంగా తన కేసి రావటం చూస్తూనే కృపాణజిత్తు భయంతో కంపించిపోతూ, తన అశ్వాన్ని వెనక్కు తిప్పి, "నా గర్భశత్రువైన జయశీలుణ్ణి చంపిగాని, నేను చావను. అందువల్ల ప్రస్తుతానికి నీతో నేను పోరదలచలేదు," అంటూ అశ్వాన్ని దౌడు తీయించసాగాడు.

సర్పనఖుడు అతడి వెంటబడ్డాడు. చెట్ల చాటున వుండి యిదంతా చూస్తున్న జయశీలుడు, సిద్ధసాధకుడితో, "సాధకా, ఈ పారిపోతున్న వాళ్ళలో ఒకడు మనకు పరమ శత్రువు, రెండోవాణ్ణి మిత్రుడిగా చేసుకోగలిగితే, మనం మాయాసరోవరాన్ని చేరవచ్చు," అన్నాడు.

"మంచి ఆలోచన. కాని, ఇద్దరూ మనకు అందకుండా పారిపోయేలా వున్నారు. ఇప్పుడేం చేసేట్టు?" అని అడిగాడు సిద్ధసాధకుడు.

జయశీలుడు చెట్ల చాటునుంచి బయిటికి వచ్చి, ఆశ్చర్యపోతూ దిక్కులు చూస్తున్న మరుగుజ్జు సేనానితో, "సేనానీ, ఆ గుర్రాల మీద పారిపోయేవాళ్ళను పట్టుకోవాలి. ఈ చుట్టుపక్కల అంతటా మీ జాతివాళ్ళున్నారుగదా. వాళ్ళను హెచ్చరించి, వాళ్ళిద్దర్నీ ప్రాణాలతో పట్టుకుని బంధించగలవా?" అని అడిగాడు.

"అయ్యో, అదెంత పని. ఈ చుట్టు పక్కల వున్న అరణ్యాలూ, కొండలూ, కోనలూ—అన్నీ మా నివాస స్థానాలే. డప్పులు వాయించి, అంచెల మీద మా వాళ్ళందర్నీ హెచ్చరిస్తాను," అని మరుగుజ్జు సేనాని, తన పొటేలు వాహనాన్ని గూడెం కేసి పరిగెత్తించాడు.

"సిద్ధసాధకా, యిక యిక్కడ మనం చేయవలసిందేమీ లేదు. ఆ కనబడే గుట్ట మీదికి పోయి, మరుగుజ్జు జాతి వాళ్ళు ఏం చేస్తారో చూద్దాం," అంటూ జయశీలుడు బయలుదేరాడు.

"జై, మహాకాళా! మనం హిరణ్యపురాన్నుంచి బయలుదేరిన వేళా విశేషం



మంచిది కాదు. ఎన్ని చిక్కులు! ఎన్ని యిక్కట్లు!'' అంటూ సిద్ధసాధకుడు నిట్టూర్చి, జయశీలుడి వెంట నడిచాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ రాళ్ళ గుట్ట మీదికి పోయి నిలబడేసరికి, ముందుగా గూడెం వైపునుంచి బిగ్గరగా ఒక డప్పు మోగటం వినిపించింది. ఆ వెంటనే అరణ్యంలో అన్ని ప్రాంతాల నుంచీ డప్పుల మోతలూ, ఆయుధాలు ధరించిన మరుగుజ్జు భటులు అరణ్యం అన్ని వైపులకూ గుంపులు గుంపులుగా పరిగెత్తుతూండటం వాళ్ళ కంటబడింది.

ఈ లోపల కృపాణజిత్తును తరుముకు పోతున్న సర్పనఖుడు, అతణ్ణి ఆ అరణ్య వృక్షాల మధ్య తరిమి పట్టుకుని చంపటం సాధ్యమయే పని కాదని గ్రహించి, పెద్ద గొంతుతో, ''ఒరే, కృపాణజిత్తూ, ఆగు! ఒకవేళ నా తమ్ముడు బతికే వున్నాడేమో మనకు తెలియదు గదా. నువ్వు, మా జలాశ్వాన్ని యిచ్చి, నీ దారిన నువ్వు పో,'' అన్నాడు.

''అశ్వాన్ని తీసుకుని నన్ను కత్తికి బలి పెట్టవన్న నమ్మకం ఏమిటి? అట్లని నేను, నీతో పోరాడేందుకు భయపడుతున్నాననుకోకు. యుద్ధంలో విజయం ఎవరిదవుతుందో, ఒక్క దేవతలకు తప్ప మరెవరికి తెలియదు. నేను, ముందు ఆ జయశీలుణ్ణి చంపాలి. ఆ తరవాత నీ సంగతి చూస్తాను,'' అంటూ కృపాణజిత్తు జలాశ్వాన్ని వేగంగా పరిగెత్తిస్తూ, నదీతీరాన్ని చేరాడు.

సర్పనఖుడు యిక మంచి మాటలతో కృపాణజిత్తును పట్టుకోవటం సాధ్యం కాదని గ్రహించి, తనూ జలాశ్వాన్ని గట్టిగా అదిలించి కొద్దిసేపటికల్లా నదీతీరాన్ని చేరి, దాని ఒడ్డు వెంట పారిపోతున్న కృపాణజిత్తు వెంటపడ్డాడు.

ఆ సరికి మరుగుజ్జు జాతి వాళ్ళలో కొందరు కృపాణజిత్తునూ, సర్పనఖుణ్ణీ చూసి, వాళ్ళ దారిని అటకాయించేందుకు ఒకచోట ఆయుధాలెత్తి పట్టుకుని

గుంపుగా నిలబడ్డారు. కృపాణజిత్తు వాళ్ళను అంతదూరంలో వుండగానే చూశాడు. ముందుకుపోతే, తను అంతకు పూర్వం నానా హింసలపాలు చేసిన మరుగుజ్జువాళ్ళు. వెను తిరిగితే తన తమ్ముడికి జరిగిన హానికి, పగ తీర్చుకునేందుకు వస్తున్న సర్పనఖుడు!

ఆ స్థితిలో కృపాణజిత్తుకు అశ్వంతో పాటు నదిలో దూకట మొక్కటే మేలైన మార్గంగా కనిపించింది. ఇలా ఆలోచించి అతడు అశ్వాన్ని గట్టు మీదినుంచి, నది కేసి మళ్ళించేసరికి, అక్కడ నదీ జలంలో తేలియాడుతూ రెండు మొసళ్లు కనిపించినై. వాటిని చూస్తూనే కృపాణజిత్తు గుండె గుభేలుమన్నది. గుండెలో గుచ్చుకునే బల్లెంపోటు మంచిదా? వెన్నుమీద పడే కత్తివేటుమంచిదా? లేక నీళ్ళపై తేలుతున్న కరకుకోరల పట్టు మంచిదా? అనుకుంటూ అతడు ఒక క్షణం నివ్వెరపోయి, అంతలోనే తనకు ఎలాగూ చావు తప్పదన్న నిస్పృహలో మొండిధైర్యం తెచ్చుకుని, "మరుగుజ్జు వాళ్ళకన్నా, సర్పనఖుడికన్నా—ఈ మొసళ్ళే కాస్త సాధుజీవులు. పైగా నేనెక్కివున్నది నీటిగుర్రం కనక, నీటిలో తన రక్షణ చూసుకునే ప్రయత్నంలో నన్నూ రక్షించక పోదు," అనుకుంటూ అశ్వాన్ని నదిలోకి దూకించాడు.

కృపాణజిత్తు వెనకవస్తున్న సర్పనఖుడు యిది చూసి, "ఔరా, తెలివి



మాలినవెధవా, ఎంతపని చేశావు? మొసళ్లు నీతోపాటు, జలాశ్వాన్ని కూడా తినకుండా కాపాడుకోవాలి. మాయాసరోవరాన్ని చేర టానికి, ఒకవేళ నా తమ్ముడు బతికుంటే యీ అశ్వమొక్కటే ఆధారం,'' అంటూ తనూ గుర్రాన్ని నదిలోకి దూకించాడు.

మొసళ్ళు రెండూ, నీటివాలున పడి కొట్టుకుపోతున్న కృపాణజిత్తు వెంట పడినై. సర్పనఖుడు కత్తిఎత్తి, వాటిని పొడిచి చంపేందుకు వెంట బడ్డాడు. ఒడ్డునవున్న మరుగుజ్జువాళ్ళు అక్కడ దొరికిన రాళ్ళనూ, ఎండుకట్టెలనూ కృపాణజిత్తు కేసి విసరసాగారు. సర్ప నఖుడు గొంతెత్తి, ''నేను మీ మిత్రుణ్ణి. ఈ దుర్మార్గుణ్ణి ప్రాణాలతో పట్టుకో బోతున్నాను; రాళ్ళతో కొట్టకండి!'' అని అరుస్తూ, మొసళ్ళలో ఒకటి నోరు తెరిచి కృపాణజిత్తు నడుంపట్టుకో బోయేంతలో దాని వెన్నుమీద కత్తితో బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు మొసలి బాగా గాయపడి నీళ్ళను అల్లకల్లోలం చేస్తూ తన్నుకో సాగింది. రెండవ మొసలి నది దిగువకు పోయి, పెద్దగా నోరుతెరిచి కృపాణజిత్తు కేసి రాసాగింది. ఇది చూసిన జలాశ్వం బెదిరి, కృపాణజిత్తు ఎంత గట్టిగా కళ్ళెం పట్టుకులాగుతున్నా ఆగకుండా, నది ఒడ్డుకేసి వేగంగా ఈదుకుంటూ పోయి, ప్రాణులను పట్టుకు తినే మృత్యువృక్షం వున్న ప్రదేశాన రొప్పుతూ గట్టు మీదికి ఎక్కింది.

ఆ మృత్యువృక్షానికి కొంచెం దూరంలో నిలబడివున్న మరుగుజ్జువాళ్ళు పెద్దగా కేకలు పెడుతూ, ''ఒరే, మహాకాయా! గుర్రాన్ని వెనక్కు తిప్పు. లేకపోతే నువు చెట్టుకు బలైపోతావు,'' అంటూ కృపాణ జిత్తును హెచ్చరించారు.

కాని, జలాశ్వం అతడు ఎంత ప్రయ త్నించినా ఆగకుండా మృత్యువృక్షం కిందికి వచ్చేసింది. అందుబాటులోవున్న కృపాణజిత్తును, మృత్యువృక్షం కొమ్మ ఒకటి గట్టిగా పట్టుకుని పైకి గుంజుకో సాగింది. —(ఇంకావుంది)





# మార్పు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీకున్న నిలకడ చాలా అసాధారణమైనది. సాధారణంగా అందరూ నాగపాలుడి లాగే, కారణం ఉన్నా, లేకపోయినా, మారి పోతూ ఉంటారు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు నాగపాలుడి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

చంద్రావర్త మనే దేశంలో దేవశ్రేష్ఠి అనే వర్తకుడికి ఒక బండీ, శ్వేతవదన మనే మేలుజాతి గుర్రమూ ఉండేవి. ఆ గుర్రం పోషణ చూసుకుంటూ, బండి తోలటానికి దేవశ్రేష్ఠి దగ్గిర నాగపాలుడు అనే కుర్రవాడు ఉండేవాడు. గుర్రానికి,

## బేతాళ కథలు

నాగపాలుడికి ఒకే ప్రాణం అన్నట్టు ఉండటం గమనించి దేవశ్రేష్ఠి, తాను చనిపోతూ ఆ గుర్రాన్నీ, బండినీ నాగపాలుడికి ఇచ్చేశాడు. నాగపాలుడు ఆ గుర్రానికి ఏ లోటూ లేకుండా చూసుకుంటూ, బాడుగకు బండి తోలుకుంటూ జీవించసాగాడు.

నాగపాలుడి పొరుగున బాడుగలకు బండి తోలి జీవించే తాత ఒకడు ఉండేవాడు. తాతకు సులోచన అనే మనమరాలుండేది. నాగపాలుడు తాత ఇంటికి తరచుగా వెళ్ళి, అక్కడ కాలక్షేపంచేస్తూ ఉండటంచేత అతనికీ, సులోచనకూ మనసులు కలిశాయి. ఇద్దరికీ పెళ్ళి కూడా దాదాపు ఖాయం అయింది.

శ్వేతవదనం ముసలిదయింది. నాగపాలుడు దాన్ని బండికి కట్టటం మానేసి, తాను వెనకవేసుకున్న డబ్బుతో దాన్ని పోషించసాగాడు. ఇది గమనించి తాత, "నేనూ ముసలివాణ్ణి అయాను. ఊరికే ఉండటం దేనికి? నా బండి నువు తోలు," అన్నాడు. నాగపాలుడు ఎలాగూ ఇంటి అల్లుడు అవుతాడు గనక, అతని సంపాదన ఉమ్మడిగా వాడుకోవచ్చునని తాత ఉద్దేశం.

నాగపాలుడు తాత గుర్రపుబండిని తోలటానికి ఒప్పుకున్నాడు, కాని తన సంపాదనలో తన కూలి కింద ఎనిమిదోవంతు ఉంచుకుని, మిగిలినదంతా సులోచనకు ఇస్తూ వచ్చాడు. అదేమని ఆమె అడిగితే,



"మనకు పెళ్లి అయినదాకా ఈ డబ్బు మీదే. పెళ్లి అయినాక మనది అనుకుందాం," అన్నాడు.

ఈ స్థితిలో నాగపాలుడు తన సంపాదన నుంచి చిల్లిగవ్వ మిగల్చలేకపోయాడు. ఏ రోజు బాడుగ కింద వచ్చే సంపాదన ఆ రోజు తన తిండికీ, శ్వేతవదనం దాణాకూ సరిపోతూ వచ్చింది.

కొద్ది రోజుల తరవాత పెళ్ళి ప్రస్తావన వచ్చింది.

"పెళ్ళి ఖర్చులకు నా దగ్గిర డబ్బు లేదు. ఏనాడు డబ్బు చేరితే ఆనాడు పెళ్ళి చేసుకుంటాను. అంతదాకా నేను చేయగలిగిందేమీ లేదు," అన్నాడు నాగపాలుడు.

సులోచనకు తొందరగా వివాహం ఆడాలని ఉన్నది.

"నీ గుర్రం భారం ఉన్నంతకాలమూ డబ్బు వెనకవెయ్యలేవు. ఆ బండినీ, ఆ గుర్రాన్నీ అమ్మితే నష్టం ఏమీలేదు. తోలటానికి మన బండి ఉండనే ఉన్నది. ముసలిగుర్రం ఖర్చు దండగే గద! పట్నంలో ఏ కసాయివాడికి అమ్మినా తేలికగా యాభైరూపాయలు వస్తాయి," అన్న దామె.

మర్నాడే నాగపాలుడు తన బండిని అమ్మేసి, గుర్రాన్ని తీసుకుని దూరంగా వున్న గ్రామానికి వెళ్ళి, బండి అమ్మగా వచ్చిన డబ్బుతో కొంచెం పొలం కొనుక్కొని, వ్యవసాయం ప్రారంభించాడు.



ముసలిగుర్రం చివరిదాకా అతని పోషణ లోనే ఉండిపోయింది.

నాగపాలుడు సులోచనను పెళ్ళిచేసుకునే ఆలోచన పూర్తిగా మానేసి, మరొక పిల్లను పెళ్ళిచేసుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నాగపాలుడు సులోచనను ఎందుకు వదిలేశాడు? అతనికి సులోచన కన్న ముసలిగుర్రం ఎక్కువనా? అతను చిన్నతనం నుంచీ చేసిన బండితోలేపని మానేసి, ఎన్నడూ అలవాటులేని వ్యవసాయం ఎందుకు చేపట్టాడు? ఈ అనుమానాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నాగపాలుడికి సులోచనతో సంబంధం ఏర్పడకముందే రెండు బంధాలున్నాయి. ఒకటి శ్వేతవదనంతో గల బంధం. రెండోది, తనకు గుర్రాన్నీ, బండినీ ఇచ్చిన యజమానితో కృతజ్ఞతాబంధం. ఈ రెంటినీ సులోచన అర్థంచేసుకోలేదు. ఆమె డబ్బు మనిషి. ఆమె దృష్టిలో ముసలిగుర్రాన్ని పోషించటం వృథా. బండితోలే వృత్తికి తమ బండీ, గుర్రమూ ఉన్నాయి. కాని నాగపాలుడు తన యజమాని ఇచ్చిన బండినే తోలగోరాడు. ఆ వృత్తి సొంతాన చేసుకోవాలంటే శ్వేతవదనాన్ని శ్రమపెట్టటం అతనికి సాధ్యంకాదు; ఇంకో గుర్రాన్ని కొనలేడు. తనకూ, సులోచనకూ ఉన్న వైఖరిలో తేడా గ్రహించగానే అతను ఆమెను వదిలేశాడు. పోతే జీవితం కొనసాగించటానికి అతను తన యజమాని ఇచ్చినదానిమీదనే ఆధారపడదలుచుకుని, బండి అమ్మేసి, పొలం కొని, యజమాని జ్ఞాపకార్థం వ్యవసాయం సాగించాడు. ఆ వృత్తిలో అతనికి ముసలిగుర్రాన్ని పోషించటం తేలిక. తన జీవితం సార్థకం అయే విధంగా నాగపాలుడు ప్రవర్తించాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# మంత్రగ్రంథం

చందనదేశాన్ని, విజయకేతు డనే రాజు చాలాకాలం పాలించి, వృద్ధాప్యదశలో మరణించాడు. ఆయనకు సంతానం లేదు. సింహాసనం కోసం కొందరు ప్రయత్నించి, దేశంలో అరాజకం కలిగించారు. ఆ స్థితిలో చాణక్యుడు అనే జ్ఞాని సహాయంతో, సూర్యకాంతు డనే క్షత్రియ యువకుడు రాజయాడు. ప్రజలు వేడుకలు చేసుకుని తమ సంతోషాన్ని వెలిబుచ్చారు.

చాణక్యుడు సూర్యకాంతుణ్ణి చిరకాలం వర్ధిల్లమని దీవించి, "ప్రభువు అన్నవాడు అధికారంలో ఉన్నాను గదా అని తన ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించ కూడదు. నేను భగవంతుణ్ణి ప్రార్థించి, పరిపాలనకు కావలసిన నియమాలు తెలుసుకుని నీకు చెబుతాను. వాటిని పాటిస్తూ, ఆదర్శప్రభువు అనిపించుకో," అని చెప్పి తన ఇంటికి వెళ్ళిపోయాడు.

తరవాత చాణక్యుడు ఇంటి వద్ద కూర్చుని ఒక గ్రంథం రచించి, దాన్ని తీసుకుపోయి సూర్యకాంతుడికి ఇచ్చాడు.

"ఇది మంత్రగ్రంథం. భగవంతుడు చెప్పగా నేను దీన్ని రాశాను. ఇందులోనివన్నీ భగవంతుడి వాక్యాలు. వాటిని ఎవరూ మార్చరాదు," అని చాణక్యుడు రాజుతో అన్నాడు.

సూర్యకాంతుడు ఆ గ్రంథాన్ని కళ్ళకు అద్దుకుని, అందులోని విషయాలన్నీ చదివి, ఒక్కొక్కటే అర్థం చేసుకుని, అర్థం కాని విషయాలను చాణక్యుడి ద్వారా తెలుసుకుంటూ, ఆ గ్రంథంలో ఉన్న ప్రకారమే పరిపాలనచేస్తూ ప్రజారంజకుడు అయాడు.

సూర్యకాంతుడి కొడుకు చంద్రకాంతుడు. అతను చిన్నతనం నుంచీ అన్ని విద్యలలోనూ అఖండ ప్రజ్ఞ కనబరుస్తూ

"వసుంధర"



వచ్చాడు. అతనికున్న ఒకేఒక పెద్ద వ్యసనం వేట.

చంద్రకాంతుడు పద్దెనిమిదేళ్ల వాడుగా ఉండగా సూర్యకాంతుడు మరణించాడు. చంద్రకాంతుడు రాజయాడు. అప్పటికే చాణక్యుడు కూడా వృద్ధుడైపోవటంచేత అయన. స్థానంలో అయన కొడుకు శ్రీశుకుడు పనిచేస్తున్నాడు.

చంద్రకాంతుడికీ, శ్రీశుకుడికీ చాలా గాఢమైన మైత్రి. అయితే దానికి తలవని తలంపుగా ఒక పెద్ద పరీక్ష ఎదురయింది. ఎలాగంటే, చంద్రకాంతుడు వేటకువెళ్లి, ఒక పొదలో ఉన్న మనిషిని చూసి మృగ మనుకుని, బాణంతో కొట్టి చంపాడు.

మంత్ర గ్రంథంలోని శిక్షాస్మృతి ప్రకారం శిక్ష అందరికీ ఒకటే. అందుచేత రాజును హత్యా నేరానికి శ్రీశుకుడు విచారించవలసి ఉన్నది. మంత్ర గ్రంథంలో చెప్పిన ప్రకారం చంద్ర కాంతుడికి యావజ్జీవ కారాగార శిక్ష విధించడం తప్ప గత్యంతరం లేదు. కాని తెలియక చేసిన పొరపాటుకు చంద్రకాంతుడికి అంత దారుణమైన శిక్ష ఇయ్యటం తప్పని శ్రీశుకుడి అంతరాత్మ చెబుతున్నది. పోనీ మంత్రగ్రంథాన్ని ఉల్లంఘించుదామంటే అందువల్ల చాలా గొడవ జరుగుతుంది.

శ్రీశుకుడు తండ్రిని సలహా అడిగితే, "వేట తమకంలో కన్నూ మిన్నూ కానకుండా ప్రవర్తించినందుకు చంద్ర కాంతుడు శిక్ష అనుభవించ వలసిందే," అన్నాడు.

శ్రీశుకుడు ఆవేశపడి, "ఈ మంత్ర గ్రంథం దేవుడే గదా చెప్పాడన్నారు. భగవంతుణ్ణి ఎలా వశపరచుకోవాలో నాకు చెప్పండి. అయన నుంచి చంద్రకాంతుణ్ణి కాపాడే ఉపాయం తెలుసుకుంటాను." అన్నాడు.

చాణక్యుడు నవ్వి, "వెర్రివాడా, ఆ వాక్యాలన్నీ నిజంగా భగవంతుడు చెప్పినవే ననుకున్నావా? అధికారం వల్ల

కలిగే అహంకారపుపొర రాజుల కళ్ళను కప్పకుండా ఉండడంకోసం నేను మంత్ర గ్రంథాన్ని భగవంతుడి పేరు మీద సృష్టించాను,'' అన్నాడు.

''అలా అయితే నేనూ భగవంతుడి పేరిట మంత్రగ్రంథంలో కొన్ని మార్పులు చేస్తాను. రాజులకు లక్ష బాధ్యత లుంటాయి. అందుచేత సామాన్యుడికీ, రాజుకూ ఒకేరకం న్యాయం పనికిరాదనీ, రాజు ఏమిచేసినా తప్పులేదనీ మంత్ర గ్రంథంలో వ్రాస్తాను,'' అన్నాడు శ్రీశుకుడు తొణకకుండా.

చాణక్యుడు కోపంగా, ''మూర్ఖుడా, స్నేహితుణ్ణి రక్షించటం కోసం మంత్ర గ్రంథంలో మార్పులు చేశావంటే, అది దేశానికే ప్రమాదం. నేరానికి పదవితో నిమిత్తం లేదు,'' అన్నాడు.

కాని శ్రీశుకుడు తన నిశ్చయాన్ని మార్చుకోలేదు. తరవాత అతను, భగవ దాదేశంగా తాను మంత్రగ్రంథంలో కొత్త సూత్రాలు చేర్చినట్టు ప్రకటించాడు. చంద్రకాంతుడు కాపాడబడ్డాడు.

ఇది జరిగిన కొద్ది మాసాలకు ఆ దేశపు సైన్యాధిపతి చంద్రకాంతుణ్ణి హత్యచేసి, తానే రాజయాడు. అయితే తన రాజ రికాన్ని ప్రజలు మన్నించాలంటే శ్రీశుకుడి సహకారం ఉండాలని గ్రహించి, అతను శ్రీశుకుణ్ణి పిలిపించాడు.

''నువు హంతకుడివి. ముందు నీ మీద విచారణ జరపాలి!'' అన్నాడు శ్రీశుకుడు



చంద్రకాంతుడి మరణానికి లోలోపల కుమిలిపోతూ.

''నేనిప్పుడు రాజును. అన్నివిచారణలకూ అతీతుణ్ణి,'' అన్నాడు సైన్యాధిపతి.

''నువు నేరం చేసినప్పుడు రాజువు కావు. న్యాయస్థానం ఎక్కక తప్పదు,'' అన్నాడు శ్రీశుకుడు.

సైన్యాధిపతి నవ్వి, ''నా నేరం నన్ను రాజుగా—అంటే నేరానికి అతీతుడుగా చేసింది. రాజైనవాడు ఏమిచేసినా తప్పు లేదని మంత్రగ్రంథమే చెబుతున్నది. ఒక కొత్త సూత్రం చేర్చండి. లేదా, తిన్నగా భగవంతుడి దగ్గిరికే వెళ్ళిపోగలరు,'' అన్నాడు.

శ్రీశుకుడికి మతిపోయినట్టయింది. తండ్రిమాట వినక, తన మిత్రుణ్ణి చంద్రకాంతుణ్ణి కాపాడటానికిగాను, తాను మంత్రగ్రంథంలో చేర్చిన మార్పు ఇలా పరిణమించింది. దాని మూలంగా అధికార దాహంగల వారందరికి కొత్త ఆశలు ఏర్పడ్డాయి.

గత్యంతరం లేక శ్రీశుకుడు మంత్రగ్రంథంలో సైన్యాధిపతి చెప్పిన మార్పులు చేశాడు. ఆ గ్రంథం ప్రజాపీడనకు బ్రహ్మాస్త్రంగా పనిచేసింది. దుష్పరిపాలనకు జవాబుగా అరాజకం చెలరేగింది. సైన్యాధిపతికి పరిపాలన చేసేటందుకు వ్యవధి లేదు, అతని కాలమంతా ఆత్మరక్షణలోనే సరిపోయింది. ఈ విప్లవదశలో ఒక కొత్త ప్రజానాయకుడు వెలువడ్డాడు. అతను పాత రాజును తొలగించి, తానే రాజయాడు.

శ్రీశుకుడు ఈ కొత్తరాజును కలుసుకుని, ''నిజంగా నువు ప్రజల బాగును కోరేవాడివే అయితే ఇప్పుడున్న మంత్రగ్రంథాన్ని మరిచిపో. అనుభవజ్ఞులతో సంప్రతించి రాజ్యపాలన చెయ్యడానికి కొత్త నియమాలూ, న్యాయసూత్రాలూ ఏర్పరచుకో. ఏ పరిస్థితుల్లోనూ వాటిని అధిగమించకు. నీ ప్రాణం కాపాడుకోవడానికే అయినా సరే, ధర్మసూత్రాల జోలికి పోకు,'' అని సలహా ఇచ్చాడు.



# ఒకరిని మించి ఒకరు

ఒక గృహస్థు పేరుపడ్డ పిసినిగొట్టు. అతని వద్ద ముష్టి పుట్టించుకువస్తానని ఒక మాటకారి తన మిత్రులతో పందెం కాసి, గృహస్థు ఇంటికి ముష్టికి వచ్చాడు.

"ఊరికి కొత్త మొహంలా ఉన్నావు. ఈ గడపలో మెతుకు పుట్టదు. పో, పో!" అన్నాడు గృహస్థు.

"పాపం, పై జన్మలో ఎన్ని కష్టాలో కదా?" అన్నాడు మాటకారి.

"ఎవరికి?" అని గృహస్థు అడిగాడు.

"వెనకటి జన్మలో నేనూ ఉన్నవాణ్ణే. మీలాగా పిసినిగొట్టునై, ఎవరికీ పెట్టక, ఈ జన్మ ఎత్తాను. మీరూ రేపు అంతేకద?" అన్నాడు మాటకారి.

పిసినిగొట్టు పదిపైసలు తీసి, "ఇది ఇస్తాను, మళ్ళీ ఎప్పుడు తీర్చుతావు?" అని అడిగాడు.

"పై జన్మకి ఋణపడి ఉంటాను," అన్నాడు మాటకారి.

"అంటే ఈ అప్పు వసూలు చేసుకోవటానికి నేను ముష్టివాణ్ణిగా పుట్టి ఈ పదిపైసలూ వసూలు చేసుకోవాలా? పద, పద," అంటూ పిసినిగొట్టు పదిపైసలూ జేబులో వేసుకున్నాడు.

—వీరేపల్లి జయరాంరెడ్డి.





# కనీసార్హత

సువర్ణపురాన్ని పాలించే చంద్రసేనుడికి మగసంతానం లేదు. ఒక్కగానొక్క కుమార్తె. ఆమె పేరు మాలిని. ఒకనాడు ఆమె ఒంటరిగా ఉద్యానవనంలో కూర్చుని రకరకాలుగా ఆలోచిస్తున్నది. ఆమె మనసు వివాహం కేసి పోతున్నది. తన ఈడు వాళ్ళు ఎప్పుడో పెళ్లిళ్లు చేసుకుని, తొలి చూలు బిడ్డలను కూడా కంటున్నారు. ఆమెకు కనీసం తల్లి ఉండి ఉంటే ఆమె మనసు గ్రహించేది. కాని ఆమె మాలిని బాల్యదశలో ఉండగానే పోయింది. తల్లి లేని మాలినిని తండ్రి ఎంతో శ్రద్ధగా పెంచి, ఆమెకు తగిన వరుడు దొరికితేనే వివాహం చేసే ఉద్దేశంతో ఉన్నాడు.

ఉద్యానవనం కాపలావాడు ఎవరినో లోపలికి రానీయకుండా అడ్డుపడుతున్నాడు. "నేను పరాయిదేశస్థుణ్ణి. ఎంతో దూరం నుంచి వస్తున్నాను. ఆ కనిపించే కొలనులో కాసిని నీళ్ళు తాగనిస్తే, నా దారిన నేను పోతాను," అంటున్నాడు అవతలి మనిషి.

మాలిని చప్పట్లు చరిచి కాపలావాణ్ణి పిలిచి, "పరదేశీల పట్ల మనం ఆదరణ చూపవలసినది పోయి, ఆ మనిషిని నీళ్ళయినా తాగనియ్యవేం?" అన్నది.

కాపలావాడు వెళ్ళి, ఆ మనిషిని లోపలికి రానిచ్చాడు. ఆ మనిషిని చూసి మాలిని విస్మయం చెందింది. అతను పాతికేళ్ళ యువకుడు. దూర ప్రయాణం చేసి మట్టికొట్టుకుని, మామూలు బట్టలే ధరించి ఉన్నా, అతను ఆమె ఊహించలేనంత అందంగా ఉన్నాడు. మనుషులలో అంత అందగాళ్ళుంటారని ఆమె ఎన్నడూ అనుకోలేదు. ఆమె అతన్ని చూస్తూనే ప్రేమించింది.

ఎం. కామేశ్వరరావు

ఆమె అతనికి తోటపనివాళ్ళ చేత కొబ్బరినీరు ఇప్పించి, అతన్ని సంభాషణ లోకి దింపింది. అతనిది పొరుగు దేశమే. అక్కడ కాటకం వస్తే, బతుకు తెరువుకోసం ఈ రాజ్యం వచ్చాడు. అతని పేరు గజపతి.

చీకటిపడే వేళకు మాలిని వెళ్ళిపోవ టానికి లేస్తూ, "రేపు సాయంకాలం కూడా ఇక్కడికి తప్పకుండా రా," అని చెప్పి, అతను ఎప్పుడు వచ్చినా లోపలికి రానియ్యమని కాపలా వాళ్ళకు చెప్పి, పల్లకీ ఎక్కి వెళ్ళిపోయింది.

రెండు, మూడు రోజులుగా మాలిని సాయంకాలం వేళ ఉద్యానవనంలో ఎవరినో కలుస్తున్నదని రాజుకు తెలిసింది. వెంటనే ఆయన మాలినిని పిలిపించి, "అమ్మా, అన్నివిధాలా నీకు తగినవాణ్ణి చూసి నీకు వివాహం చేద్దామని ప్రయ త్నిస్తున్నాను. నువు రోజూ ఉద్యాన వనంలో ఎవరో పరపురుషుణ్ణి కలుసు కుని, అతనిపట్ల స్నేహంగా ఉంటున్నట్టు విన్నాను. అతన్ని వివాహం చేసుకునే అభిప్రాయం నీకు ఉన్నట్టుంటే, అతన్ని నా దగ్గిరికి తీసుకురా. అతను నీకు అర్హుడో, కాదో నేను చూస్తాను," అన్నాడు.

మర్నాడు మాలిని గజపతిని కలుసుకో గానే, "మా నాన్న నీ అర్హత పరీక్షిస్తాడట. నీకు నిజంగా నా మీద ప్రేమ ఉంటే



నువు జాగ్రత్తగా ఆ పరీక్షలో నెగ్గాలి. లేని పక్షంలో నీ దారి నీదే," అని చెప్పి, అతన్ని రాజు వద్దకు తెచ్చింది.

రాజు గజపతిని యుద్ధ విద్యలను గురించీ, యుద్ధ వ్యూహాలను గురించీ, రాజనీతి గురించీ ప్రశ్నలు వేశాడు. గజపతి ఒక్క ప్రశ్నకూ సమాధానం చెప్పలేక పోయాడు. రాజు అసంతృప్తి చెంది, అతన్ని పంపించేశాడు.

తరవాత ఆయన మాలినితో, "ఈ గజపతి నీకు భర్తగా బొత్తిగా తగడమ్మా. రాజుకు ఉండదగిన లక్ష ణాలలో మచ్చుకు ఒకటైనా అతనిలో లేదు. అతన్ని పంపేశాను," అన్నాడు.

మాలిని హతాశురాలై, "మీరు చాలా తొందరపడ్డారు, నాన్నా. అతను మామూలు మనిషి. ఒక్కసారిగా అతనిలో రాజ లక్షణాలన్నీ ఎలా వస్తాయి? మీరు అతన్ని రాజరికానికి సంబంధించిన ప్రశ్నలే వెయ్యడం చాలా అన్యాయం!" అన్నది ఆవేశంగా.

ఆ రాత్రి అంతా ఆమె చాలా దుఃఖించింది. మర్నాడంతా ఆమె మనసు మనసులోలేదు. మామూలు ప్రకారం ఆమెకు ఉద్యానవనానికి వెళ్ళాలనిపించలేదు. కాని తాము కూర్చుని కబుర్లు చెప్పుకున్న చోటు చూసి అయినా ఊరట చెందుదామని ఆమె కొంత ఆలస్యంగా ఉద్యానవనానికి వెళ్ళింది.

ఆమె వెళ్ళేసరికి గజపతి ఉద్యానవనంలో ఆమె కోసమే ఎదురు చూస్తున్నాడు. ఆమెను చూడగానే అతను లేచి, ఎదురు వచ్చి, "మీ నాన్న నన్ను అడిగినవన్నీ పిచ్చి ప్రశ్నలే! రాజకీయాలు నాకెలా తెలుస్తాయి? ఇక నువు తెగించి నీ నిర్ణయం మీ నాన్నకు చెప్పేవరకూ మనం ఇలా రహస్యంగా కలుసుకోక తప్పదు," అన్నాడు.

మాలినికి అతని మీద ఒక్కసారిగా అసహ్యం పుట్టుకొచ్చింది. ఆమె ఇలా అన్నది: "ఇక మన వివాహం అన్నది కలలో మాట! నీకు రాజకీయమైన అర్హతలు లేనందుకు తప్పుపట్టను. పరీక్షలో నెగ్గకపోతే నీ దారి నీ దేనని ముందే చెప్పాను. పరీక్షలో నువు నెగ్గలేదు. నిజంగా నీకు ఆత్మాభిమానం ఉంటే మళ్ళీ నాకు నీ ముఖం చూపించి ఉండవు. చూపించినా పెళ్ళి ప్రసక్తి తెచ్చి ఉండవు. ప్రతి మగవాడికీ ఉండవలసిన పౌరుషం అనే కనీసార్హత కూడా నీకు లేకపోయింది. పైపెచ్చు నేను నీ కోసం నా తండ్రిని వంచిస్తానని కూడా అనుకోగలిగావు. ఇక నీ దారి నువు చూసుకో".

ఆమె కాపలావాళ్ళతో, అతన్ని ఎన్నడూ ఉద్యానవనంలోకి అడుగు పెట్టనియ్యవద్దని చెప్పి, అంతఃపురానికి తిరిగి వెళ్ళింది.





సుభిక్షంగా ఉన్న ఒక దేశంలో అకస్మాత్తుగా దొంగతనాలు సాగాయి. రోజూ దొంగతనాలు జరుగుతున్నా మామూలు గస్తీ భటులకు దొంగల జాడ దొరకలేదు.

అందుచేత రాజు దొంగలను పట్టటానికి ఒక ప్రత్యేక సైనిక దళాన్ని నియోగించాడు. అందువల్ల కూడా ఆవంత లాభం లేకపోయింది. రాజు తన సేనానాయకుడైన రణధీరుణ్ణి దొంగలను పట్టే పనికి నియోగించాడు. ఒక వారంలో దొంగలను పట్టాలని ఆజ్ఞ పొందిన రణధీరుడు నాలుగు వారాలు గడిచినా దొంగలను పట్టలేకపోయాడు.

అందుచేత రాజు తాను కూడా దొంగలను వేటాడటానికి పూనుకున్నాడు. ఆయన నిద్రమానుకుని, మూడు రాత్రులు నగరమంతా గస్తీ తిరిగాడు. కాని అందువల్ల ఏమీ ప్రయోజనం కలగలేదు. దొంగతనాలు యథాప్రకారం సాగుతూనే వున్నాయి.

అన్ని ప్రయత్నాలూ విఫలమైనాక రాజుకు మంత్రిని సంప్రతించాలన్న ఆలోచన కలిగింది. మంత్రి ఆరోగ్యం బాగాలేక ఆరు మాసాలుగా ఇంటిపట్టునే ఉంటున్నాడు.

రాజు మంత్రిని చూడబోయి, దొంగలను పట్టేందుకు తాను చేసినదంతా చెప్పి, "ఇప్పుడు నీ బుద్ధికుశలత అంతా వినియోగించి దొంగలను పట్టాలి," అన్నాడు.

"చిత్తం, మహారాజా! నాకిప్పుడు కొంత స్వస్థతగానే ఉన్నది. అందుచేత రేపు ఉదయం నేను కొలువుకు వచ్చి, ఈ దొంగలను పట్టే పథకం నివేదిస్తాను," అన్నాడు మంత్రి.

గుండాల విజయ

మర్నాడు ఉదయం మంత్రి రాజు గారి కొలువుకు రాలేదు. మధ్యాన్నం అయింది. అప్పటికీ రాలేదు. ఇంటికి కబురు చేస్తే, మంత్రిగారు ఉదయమే రాజుగారి కొలువుకు బయలుదేరినట్టు తెలిసింది.

ఆ రోజు సాయంకాలం రాజు సభ చాలించబోతూండగా మంత్రి హడావిడిగా వచ్చాడు.

"దొంగల విషయమై ఏమాలోచించావు?" అని రాజు అతన్ని కోపంగా అడిగాడు.

"మహారాజా, దొంగలది ఒక సమస్య కాదు. వాళ్ళను నేను ఎప్పుడైనా పట్ట గలను. కాని అంతకన్న పెద్ద ప్రమాదం రాబోతున్నది. మన పడమటి సరిహద్దు మీద శత్రువు దాడి చేయబోతున్నట్టు రూఢిగా తెలిసింది. ఆ సరిహద్దును కాపాడుకోవటం ఎంత ముఖ్యమో తమకు తెలియందికాదు. వెంటనే మన సేనాపతి రణధీరుణ్ణి కొంత పెద్ద సేనతో అక్కడికి పంపటం ఎంతైనా అవసరం," అన్నాడు మంత్రి.

రాజు అజ్ఞాపించిన మీదట రణధీరుడు సేనతో పడమటి సరిహద్దుకు వెళ్ళిపోయాడు.

పదిరోజులు గడిచిపోయాయి. రణధీరుడు తిరిగివచ్చి, "ప్రభూ, దాడి జరిగే సూచనలు ఏమీ కనిపించలేదు. ఎందుకైనా మంచిదని కొంత సేనను సరిహద్దున ఉంచి, తమ ఆజ్ఞ కోసం తిరిగి వచ్చాను," అని, మంత్రి కేసి తిరిగి, "మీరు దొంగలను పట్టారా?" అని హేళనగా అడిగాడు.

"లేదు, సేనాపతీ. దొంగను రుజువు చేసేందుకు చిన్న ఉపాయంతో ఇక్కడి నుంచి పంపేశాను. అది మొదలు దొంగతనాలు జరగటం లేదు," అని మంత్రి రాజు కేసి తిరిగి, "మహారాజా, రణధీరుణ్ణి వెంటనే బంధించండి. అతని అనుచరులు వారే బయటపడతారు," అన్నాడు.



# తప్పుడు సాక్ష్యం

ఒక గ్రామంలో తిరుగులేని పలుకుబడి గల ఒక భూస్వామి, ఒక వ్యాపారితో పోట్లాట పెట్టుకుని ఆగ్రహావేశంలో చంపేశాడు. ఆ ఊళ్ళో ఆ భూస్వామికి ఎదురు తిరిగే యువకుడు గోవిందుడు ఒకడున్నాడు. హత్యానేరం వాడిమీదికి తోయ నిశ్చయించి భూస్వామి, పేరయ్య అనే పురోహితుడికి డబ్బు బాగా లంచం పెట్టి, గోవిందుడు వ్యాపారిని చంపుతూండగా తాను కళ్ళారా చూసినట్టు సాక్ష్యం చెప్పటానికి ఒప్పించాడు.

న్యాయస్థానంలో పేరయ్య ఇలా చెప్పాడు: "నేను పురోహితుణ్ణి. నాకు పెళ్ళియీడు కుమార్తె ఉన్నది. హత్య జరిగిన రోజు ఆదివారం సాయంకాలం అయిదు గంటలకు, నా కుమార్తె పెళ్ళి పత్రిక రాయించటానికి నేను రామశాస్త్రిగారి ఇంటికి పోతూ, తోవలో గోవిందుడు వ్యాపారిని కత్తితో పొడవటం కళ్ళారా చూశాను. అప్పుడు అయిదు గంటల ఇరవై నిమిషాలు అయి ఉంటుంది."

న్యాయాధికారి వెంటనే, "అబద్ధం చెబుతున్నావు. ఆదివారం సాయంకాలం నాలుగున్నర నుంచి ఆరుదాకా రాహుకాలం. ఆ సమయంలో నువ్వు నీ కూతురి పెళ్ళి పత్రిక రాయించటానికి బయలుదేరుతావా? శుద్ధ అబద్ధం," అన్నాడు.

వెంటనే పేరయ్య కంగారుపడి నిజం బయటపెట్టేశాడు. భూస్వామితోబాటు పేరయ్య కూడా శిక్షపడ్డాడు.

—కోలార్ పద్మావతి.





# మంత్రాల పోతయ్య

ఒక ఊళ్లో పోతయ్య అనే భూతవైద్యుడు ఉండేవాడు. ఊళ్లో ఏ ఇంట ఎవరికి జబ్బు చేసినా, అతను వాళ్ళను కలిసి, "మీ మీద ఫలానా వాళ్ళు చేతబడి చేయించారు. దానికి విరుగుడు చెయ్యక పోతే ప్రమాదం," అని చెప్పి, వారిని భయపెట్టి, అవసరమైతే దొంగరుజువులు చూపేవాడు. అమాయకులైన గ్రామ ప్రజలు పోతయ్యమాటలు నమ్మి, అతని చేత విరుగుడు చేయించి, అతనికి డబ్బూ, కోళ్ళూ, గొర్రెలూ కూడా ఇచ్చుకునేవాళ్ళు.

పోతయ్య మూలంగా గ్రామంలో మనుషుల మధ్య ఐక్యతపోయింది; ఒకరి మీద ఒకరికి అనుమానం పెరిగింది. ఊళ్ళో అందరికి భూతవైద్యుడు పోతయ్య అంటె గౌరవమూ, భయమూ కూడా ఉండేవి.

అయితే రామయ్యా, కామయ్యా అనె ఇద్దరు మిత్రులు పోతయ్య మాయలకు చాలా కాలం లొంగిరాలేదు. వాళ్లు పక్క పక్క ఇళ్ళవాళ్లు. రామయ్య లోకజ్ఞానం కలవాడు. కామయ్య కొంచెం అమాయకుడు, కాని రామయ్య మీద అతనికి అమితమైన గురి. రామయ్య కూడా కామయ్యను తన తమ్ముడిలాగా చూసుకుంటూ, మోసపోకుండా కాపాడేవాడు. పోతయ్య చేసే మోసాలను గురించి రామయ్య కామయ్యతో చెప్పేవాడు. కాని కామయ్యకు లోలోపల భూతవైద్యంలోనూ, మారెమ్మలూ, మైసమ్మలూ అంటేనూ నమ్మకం ఉండేది.

కామయ్య తన మోసానికి గురికాకుండా కాపాడుతున్నది రామయ్యేననీ, ఆ ఇద్దరి మధ్యా స్నేహం చెడగొట్టితే, ఇద్దరూ తనకు లొంగి వస్తారనీ పోతయ్య అను

బూర్లె నాగేశ్వరరావు

కున్నాడు. ఒక రాత్రి అతను నాలుగు మానికెల అనుములు తీసుకుపోయి, కామయ్య గిత్త ముందు పెట్టి, ఎవరికంటా పడకుండా ఇల్లు చేరుకున్నాడు.

తెల్లవారే సరికి గిత్త కడుపు బానలా వాచింది. అది ఆయాసంతో కిందపడి తన్నుకోసాగింది. అది చూసి కామయ్య నెత్తీ నోరూ బాదుకుంటూ, రామయ్యను పిలిచి చూపించాడు.

రామయ్య గిత్తను పరీక్షించి, కామయ్యతో, "నువ్వేమీ కంగారుపడకు. ఇదేదో మిక్కుటంగా తిన్నట్టున్నది. సాయంకాలానికి అదే తగ్గిపోతుంది," అని ధైర్యం చెప్పి, గిత్త నోట్లో రెండు గొట్టాల చింతపులుసు పోయించాడు.

అయినా కామయ్యకు ధైర్యం చాల లేదు. కనిపించినవారి నందరినీ సలహా అడిగాడు. ఎందుకంటె కామయ్య వ్యవసాయం పూర్తిగా ఆ గిత్త మీద ఆధారపడి ఉన్నది. దాన్ని అతను బోలెడు డబ్బు పోసి కొన్నాడు.

పోతయ్య మనిషి ఒకడు కామయ్య ఇంటికి వచ్చి, గిత్తను చూసి, "ఏం, కామయ్యా? నిద్ర పోతున్నావా? మందులకు నయం కావటానికి ఇది రోగం కాదు. నువు వెంటనే పోతయ్యను కలవడం మంచిది. మొన్న వెంకట్రామయ్యగారి



గిత్తా ఇలాగే పడిపోతే పోతయ్య క్షణంలో నయం చేశాడు," అన్నాడు.

కామయ్యకు పోతయ్య మీద మనసు పోయింది. రామయ్య చూడకుండా అతను పోతయ్యను కలుసుకుని, చేతులు పట్టుకుని, "నీ కాళ్ళు పట్టుకుంటా! నా గిత్తను బతికించు!" అన్నాడు.

పోతయ్య బెట్టుచేస్తూ, "నా మీద గురిలేని వాడివి, నీకు నేను ఏం చెప్పినా వెగటుగా ఉంటుంది," అన్నాడు.

"బాబ్బాబు, బుద్ధి తక్కువయింది. ముందే నీ దగ్గిరికి వచ్చి ఉంటె, నా గిత్త ఈ పాటికి నెమరు వేస్తూండేది," అన్నాడు కామయ్య.



పోతయ్య ఆశ్చర్యం నటిస్తూ, "ఏమిటీ? నీ గిత్త నెమరువెయ్యటంలేదా? ఏదో తతంగం చేశారన్నమాట! పద, వాళ్ళ అంతు చూస్తాను," అని సంచీ, సరంజామా తీసుకుని, కామయ్య వెంట గిత్తను చూడడానికి వచ్చాడు.

పోతయ్య గిత్తను పరీక్షించి, దాని తోక కుచ్చు నుండి ఒక వెంట్రుక లాగి చేత పట్టుకుని, ఏదో మంత్రం చదివాడు. చిత్రంగా పోతయ్య చేతిలోని వెంట్రుక గిరగిరా మెలికలు తిరిగి, ఉండచుట్టుకు పోయింది.

అది చూసి కామయ్య నిలువునా కంపించిపోయాడు.

"చూశావా, కామయ్యా? ఇంకొంచెం ఆలస్యంచేసి ఉంటే గిత్త నీకు దక్కేది కాదు. ఇంకా సమయం దాటిపోలేదు. సూర్యోదయం కాకముందే విరుగుడు చేస్తాను. ప్రస్తుతం ఈ ఉండలు దాని కడుపులో వెయ్యి. సాయంకాలానికి లేచి నిలబడుతుంది," అంటూ పోతయ్య వెంటతెచ్చిన సంచీలోంచి రెండు ఉండలు తీసి కామయ్య చేతికి ఇచ్చి, రాత్రికి చెయ్యవలసిన ఏర్పాట్లు కామయ్య చెవిలో రహస్యంగా చెప్పాడు.

బాగా చీకటిపడి పోతయ్య కామయ్య ఇంటికి వచ్చాడు; తల అంతా విరబోసుకుని, విభూతి పెట్టుకుని, ఇంటి తలుపులన్నీ మూయించి, నట్టింట ముగ్గులు వేశాడు. తరవాత అతను ముగ్గు మీద దీపం ఉంచి, నిమ్మగాయలూ, గుమ్మడి కాయలూ కోస్తూ, క్రీం హ్రాం అని మంత్రాలు చదివాడు. ఆ తరవాత అతను ముగ్గు మీద పద్మాసనం వేసుకుని కూర్చుని, ఒక్కక్షణం కళ్ళు మూసుకున్నాడు.

అంతాచూస్తున్న కామయ్యకు పోతయ్య అంటే సామాన్యుడేమీ కాదనిపించింది; ఇన్నాళ్ళూ రామయ్య మాటలు విని, పోతయ్యను చిన్నచూపు చూసినందుకు పశ్చాత్తాపపడ్డాడు.

పోతయ్య చప్పున కళ్ళు తెరిచి, "కామయ్యా, పలుగు తీసుకుని నాతోరా!" అంటూ లేచి పెరట్లోకి దారితీసి, ఇంటికి ఈశాన్యంగా ఒకచోటు పరీక్షించి, అక్కడ తవ్వమన్నాడు. కామయ్య తవ్వాడు.

చిత్రం! మూరెడులోతున ఒక మట్టి గురిగి బయటపడింది. అందులో కొన్ని గవ్వలూ, వెంట్రుకలతాడూ, ఒక చెక్క బొమ్మా, మూడు ఎండిపోయిన నిమ్మ కాయలూ ఉన్నాయి.

"చూశావా, కామయ్యా? నీ గొడ్డూ గోదా ఈ నిమ్మకాయలలాగా ఎండిపోయే వన్నమాట!" అన్నాడు పోతయ్య.



కామయ్య రక్తం ఉడికిపోయింది. "ఈ పని చేసినదెవరు?" అన్నాడు.

"ఎందుకులే, కామయ్యా? చెప్పినా నమ్మవు. ఈ పుణ్యం కట్టుకున్నవాడు నీ మిత్రుడు రామయ్యే." అన్నాడు పోతయ్య.

కామయ్య ఈ మాట నమ్మలేక పోయాడు. కాని పోతయ్య చూపే రుజువులను బట్టి నిజమే కావచ్చుననుకున్నాడు.

"ఎవరు చేయించినా, ఇప్పుడు జరగవలసిన తతంగం చాలా ఉన్నది. దీనికి విరుగుడు చెయ్యాలి. బలి ఇయ్యాలి. అందుకు మామూలు పోతులు పనికిరావు. ముఖాన తెల్లమచ్చ ఉన్న నల్లమేకపోతు కావాలి. దాన్ని నువు సంపాదించకపోతే, మనం చేసినదంతా బూడిదలో పోసిన పన్నీరే!" అన్నాడు పోతయ్య.

"ఉన్నపళంగా అలాటి పోతును, ఈ రాత్రి సమయంలో, తెమ్మంటే ఎలా?" అన్నాడు కామయ్య నిరాశతో.

పోతయ్య ఆలోచించినట్టు నటించి, "రామయ్య మందలో అలాటి పోతును చూసినట్టు గుర్తు." అన్నాడు.

"అడిగితే కోటి ప్రశ్నలు వేస్తాడు. ఇస్తాడన్న నమ్మకం కూడా లేదు." అన్నాడు కామయ్య.

"ఆ పోతును రామయ్య అడిగితే ఇస్తాడా? ఎవరూ ఇయ్యరు. నువు

దొంగతనం చెయ్యాలిసిందే,'' అన్నాడు పోతయ్య.

దొంగతనం అనేసరికి కామయ్య కళ్లు వెళ్ళబెట్టాడు.

''రెండువేలు ఖరీదు చేసే నీ గిత్తను చంపాలని చూశాడే రామయ్య! దాన్ని రక్షించుకోవటానికి రామయ్య తల నరికినా పాపం లేదంటాను,'' అన్నాడు పోతయ్య.

కామయ్య గుండె రాయిచేనుకుని రామయ్య దొడ్లో ప్రవేశించి, తెల్లమచ్చ గల పోతును తెచ్చి పోతయ్య ముందు ఉంచాడు. పోతయ్య దాన్ని బలిచేశాడు.

తెల్లవారుఝామునే లేచి, అరుగు మీద కూర్చున్న రామయ్యకు కామయ్య ఇంట్లో నుంచి వెళుతున్న పోతయ్యా, మేకపోతు శవాన్ని మోసుకుపోతున్న అతని మనుషులూ కనిపించారు.

కామయ్య కూడా పోతయ్య బుట్టలో పడ్డాడన్నమాట!

తెల్లవారినాక తన మందలో పోతు కనిపించకపోయేసరికి, రామయ్య జరిగిన దేమిటో గ్రహించాడు. పోతయ్య ఆట కట్టించకపోతే గ్రామంలో మనుషులు ఒకరిని ఒకరు పీక్కు తినే పరిస్థితి రాక తప్పదని రామయ్యకు తోచింది.

వెంటనే రామయ్య కామయ్య ఇంటికి వెళ్లి, నెమరువేస్తున్న గిత్తను చూస్తూ, ''చూశావా, కామయ్యా? నీ గిత్తకు తగ్గి పోయింది. అంతా ఆ మైసమ్మతల్లి దయ! నీ గిత్తకు తగ్గిపోతే నా తెల్లమచ్చ నల్ల



పోతును బలి ఇస్తానని మొక్కాను. కాని మోసం జరిగిపోయింది. దాన్ని రాత్రి ఎవరో దొంగిలించారు. మైసమ్మకు ఆగ్రహం వస్తే మందలో ఒక్క గొడ్డు మిగలదు!'' అన్నాడు భయం నటిస్తూ.

మైసమ్మ పేరు వినగానే కామయ్య గుండె ఝల్లుమన్నది. అతను వణికిపోతూ రామయ్య చేతులు పట్టుకుని, ''రాత్రి నీ పోతును నేనే దొంగిలించాను. క్షమించు! మైసమ్మకు కోపం రాకుండా ఏదైనా మార్గం చూడు,'' అంటూ జరిగిన దంతా రామయ్యకు చెప్పేశాడు.

రామయ్య నవ్వి, ''పిచ్చివాడా, నీ చేత నిజం చెప్పించటానికే అలా అన్నాను. మంత్రాలకు చింతకాయలు రాలవు. నీ గిత్తకు నయం కావటానికి పోతయ్య ఎంతమాత్రం కారణం కాదు. చూడు, నీ గిత్త వేసిన పేడలో ఏమున్నాయో!'' అన్నాడు.

కామయ్య పేడను పరీక్షించితే ఉబ్బి పోయిన అనుములు ఉన్నాయి. గిత్తకు అనుములు ఎవరు పెట్టారో కామయ్యకు అంతుపట్టలేదు.

తమ ఇద్దరి మధ్యా స్నేహం చెడగొట్ట టానికి పోతయ్యే ఆ పని చేశాడని రామయ్య చెప్పాడు. కామయ్యకు ఒక్క సారిగా కనువిప్పు కలిగింది.



"చూస్తూండు! ఈ రాత్రికే ఈ పోతయ్య బతుకు బయటపెట్టి, ఈ గ్రామానికి వాడి పీడ లేకుండా చేస్తాను. నలుగురు మను షులను సిద్ధంగా ఉంచు,'' అన్నాడు రామయ్య.

ఆయన పోతయ్య ఇంటికి పరిగెత్తు కుంటూ వెళ్లి, ''పోతయ్యా, నీవే దిక్కు! రెండు రోజులుగా ఆవు పాలు ఇయ్యడం లేదు. దూడను దగ్గిరికి రానివ్వదు. చిన్న బర్రె నీళ్లు ముట్టడం లేదు. పెద్ద బర్రె కుడితి తాగటం లేదు. నిక్షేపంలాటి మేక పోతు రాత్రికి రాత్రి మాయమయింది. ఇదంతా చూస్తుంటే నా ఇంటి కెవరో చేతబడి చేయించినట్టున్నది. చావు బతు

కుల్లో ఉన్న మా కామయ్య గిత్తను క్షణంలో బాగుచేశావని విని నీ దగ్గిరికి పరిగెత్తుకుంటూ వచ్చాను. నా ఇంటికి ఒక్కసారి వచ్చి చూడు," అని ప్రాధేయ పడ్డాడు.

ఇంతకాలానికి రామయ్య దిగివచ్చి నందుకు పోతయ్య ఎంతగానో సంతోషించాడు. ఇక గ్రామంలో తనకు తిరుగు లేదనుకుంటూ అతను రామయ్య వెంట అతడి ఇంటికి వచ్చాడు.

అంతాచూసి పోతయ్య రామయ్యతో, "ఇది తప్పకుండా చేతబడి ప్రభావమే అనిపిస్తున్నది. అది రుజువు చెయ్యాలి గద. రేపు రాత్రికి అంతా తేలిపోతుంది. నువు నిశ్చింతగా ఉండు," అని ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ రోజు అర్ధరాత్రివేళ రామయ్యా, కామయ్యా, నలుగురు మనుషులూ రామయ్య పెరట్లో కాపువేశారు. నల్లటి మునుగుతో పోతయ్య గోడ దిగివచ్చి, పెరట్లో ఒకచోట కూర్చుని తవ్వసాగాడు. త్వరలోనే అతని చుట్టూ మనుషులు యమదూతల్లా నిలబడ్డారు. పోతయ్య పెద్దగా మూలిగి, పారిపోవటానికి లేచి నిలబడ్డాడు.

రామయ్య అతనితో, "ఏం, పోతయ్యా, మట్టిగురిగి తెచ్చావా?" అంటూ మునుగు లాగాడు. మట్టిగురిగి జారి కిందపడింది. అందులో గవ్వలూ, వెంట్రుకల తాడూ, చెక్కబొమ్మా, ఎండు నిమ్మకాయలూ ఉన్నాయి.

కామయ్య కోపంకొద్దీ పోతయ్య వీపులో పొడిచాడు. పోతయ్య రామయ్య కాళ్ళ మీద పడ్డాడు. రామయ్య పోతయ్యను కాళ్ళూ, చేతులూ కట్టేసి, మర్నాడు గ్రామస్థులందరినీ పిలిపించి, పోతయ్య నోటిమీదిగానే అతని దుర్మార్గం చెప్పించాడు.

గ్రామస్థులు పోతయ్య పళ్ళు ఊడగొట్టి అంతటితో వదిలారు. ఆ తరవాత పోతయ్య ఏనాడూ భూతవైద్యం మాట తలపెట్టలేదు.



# పనికిమాలిన గొప్ప కానుక

కౌంచిపురాన్ని ఏలిన కాంచనవర్మ కళాకారులకు విలువైన బహుమతులిచ్చి, గౌరవించేవాడు. వాటి మీద రాజముద్ర ఉండేది. వీటిని అందుకున్న వారు వాటిని శాశ్వతంగా ఉంచుకోవాలి గాని, అమ్మరాదు.

ఒకసారి కాంచనవర్మ వేదశర్మ అనే పండితుడికి తన మెడలో ఉన్న రత్నహారాన్ని బహూకరించాడు. పూట గడవని వేదశర్మ రాజుతో, "పనికిమాలిన ఈ విలువైన కానుక నాకు వద్దు," అన్నాడు.

రాజుకు ఆగ్రహమూ, ఆశ్చర్యమూ కలిగి, వేదశర్మ ఉద్దేశం అడిగాడు. వేదశర్మ తన దారిద్ర్యబాధ చెప్పుకున్నాడు.

తాను చేస్తున్న బహుమతులు తన గొప్పతనాన్ని చాటుతున్నాయేగాని వాటిని అందుకున్న వారికి ఎందుకూ పనికిరావటం లేదని రాజు గ్రహించి, తాను మెచ్చుకున్న కళాకారులకు నిజమైన ఉపకారం చేయసాగాడు. —కుమారి టి. నాగలక్ష్మి.





# చచ్చి బతికిన శవం

రాము చాలా రకాల అనుభవం గలవాడు. కుర్రవాడుగా అతను ఒక ఐంద్రజాలికుడి వద్ద పనిచేశాడు; పద్దెనిమిదో ఏట ఒక ఫొటోలు తీసేవాడి కింద పనిచేశాడు; తరవాత మందుల షాపులో పనికి కుదిరాడు; కొంత డబ్బు పోగుచేసుకున్నాక తానే సొంతాన మందులషాపు పెట్టుకున్నాడు.

యాభై ఏళ్ళవాడై ఉండగా కలరా తగిలి రాము కుటుంబం వాళ్ళంతా ఒక్క సారిగా చనిపోయారు. రాము జీవితం మీద విరక్తి చెంది, ఇల్లు వదిలి, కాషాయ బట్టలు ధరించి, ఏకతార మీటి భగవత్సంకీర్తన చేసుకుంటూ దేశం మీద తిరగసాగాడు.

అలా తిరుగుతూ రాము ఒక గ్రామం సమీపంలోకి వచ్చేసరికి, భయంకరమైన గాలివాన ప్రారంభమయింది. రాముకు సమీపంలోనే శ్మశానం ఉన్నది. అందులో ఒక పాక ఉన్నది. అది శవాలను దహనం చెయ్యటానికి వచ్చేవాళ్ళు నిలవటానికి వేసినది. రాము అందులో చేరాడు. చుట్టూ కమ్ముకుంటున్న చీకట్లలోకి అతను పరికించి చూసేసరికి, సమీపంలో ఒక పాడె మీద శవం కనబడింది. దాని దగ్గిర ఎవరూ లేరు. బహుశ దాని తాలూకు మనుషులు కట్టెలు వగైరా తీసుకు రావటానికి వెళ్ళి ఉంటారు.

రాము చూస్తూండగానే శవం నుంచి గురక లాటిది వినిపించింది. అది కట్ల నుంచి బయటపడటానికి ప్రయత్నిస్తున్నట్టు కనబడింది. అది చూసి మరొక రైతే హడలిపోయి ఉండురేమోగాని భయమంటే ఏమిటో ఎరగని రాము పాడెను సమీపించి, తన సంచీ నుంచి చాకు తీసి పాడె కట్లన్నీ కోశాడు. శవం

ఏ. సి. సర్కార్, ఐంద్రజాలికుడు

కాళ్ళూ, చేతులూ కొట్టుకోసాగింది. రాము దానికి ప్రథమ చికిత్స చేసి శ్వాస ఆడేలాగ చేశాడు. అతని ప్రయత్నాలు ఫలించి, చచ్చిపోయిన మనిషి తిరిగి ప్రాణం పోసుకుని, కళ్ళు తెరిచి లేచి కూర్చున్నాడు.

''ఎవరు నువు ?'' అని రాము అతన్ని అడిగాడు.

అతను ముప్ఫై ఏళ్ళ యువకుడు. కొంచెం ఆగమని సైగ చేసి, అతను కొద్ది నిమిషాల అనంతరం తన కథ చెప్పాడు. అతని పేరు శ్యామ్. ఆ ఊరి రైతు. ఆ ఉదయం పొలం దున్నుకుంటూండగా పాము కరిచింది. పాము మంత్రాలు వేశారుగాని ప్రయోజనం లేకపోయింది. తరవాత ఏమి జరిగినదీ శ్యామ్ ఎరగడు.

గాలివాన ఎంత అకస్మాత్తుగా వచ్చిందో అంత అకస్మాత్తుగానే పోయింది. ఎవరో మనుషులు గ్రామం నుంచి దీపాలతో వస్తూండటం కనిపించింది. రాము వెంటనే శ్యామ్‌ను చేయి పట్టుకుని పాకలోకి నడిపించి తెచ్చాడు.

వచ్చిన జనం ఉత్త పాడెను చూసి దడుచుకున్నారు. శవాన్ని ఏ పిశాచాలో ఎత్తుకుపోయి తినేసి ఉంటాయని అనుకుని, తాము తెచ్చిన కట్టెల మోపులు అక్కడే వదిలేసి, పారిపోయారు.



''వాళ్ళు పనికిమాలిన మూఢులు. నీకు ఒంట్లో కాస్త బాగా ఉంటె నేనే నిన్ను మీ ఇంటికి చేరుస్తాను.'' అన్నాడు రాము.

''నా గతి ఏం కానున్నదో తెలీదు. నేను బతకకుండా ఉన్నా బాగుండేది. మా అమ్మా, నా భార్యా, పిల్లలూ నన్ను స్వీకరించరు. నా కళేబరంలో ఏదో పిశాచం దూరిందనుకుంటారు. వాళ్ళవీ మూఢ నమ్మకాలే !'' అన్నాడు శ్యామ్.

''అంతగా బెంబేలు పడకు. నీకు సహాయంగా నేనున్నాను. మీ వాళ్ళు నిన్ను చేరనియ్యకపోతే, ఇద్దరమూ హాయిగా సంకీర్తన చేసుకుంటూ తిరుగుదాం,'' అన్నాడు రాము.



తెల్లవారింది. రాము శ్యామ్‌ను వాళ్ళ ఇంటికి తీసుకుపోయాడు. ప్రాణంతో ఉన్న భర్తను చూడగానే శ్యామ్ భార్య కెవ్వున అరిచింది. ఆమె చప్పున తలుపు మూసి, లోపలికి పరిగెత్తింది. మరెవరూ లోపలినుంచి బయటికి తొంగి చూడలేదు.

''చూశావు గద? నేను ఎందుకు బతికినట్లో నువే చెప్పు,'' అన్నాడు శ్యామ్ బాధగా.

''దీని అంతు చూడకుండా వదలను,'' అన్నాడు రాము.

అకస్మాత్తుగా ఒక కిటికీ తెరుచుకున్నది. శ్యామ్ తల్లి బయటికి చూసింది. శ్యామ్ తన కేసి చూడగానే ఆమె అతనికి దణ్ణం పెట్టి, ''తండ్రీ, పిశాచమా, మమ్మల్నెందుకు పీడించటానికి వచ్చావు? శ్యామ్ ఆత్మ శాంతించటానికి ఘనంగా శ్రాద్ధం పెడతాం. అప్పుడే నీకూ్కడా పిండాలు పెడతాం. దయచేసి మా జోలికి రాకు. అసలే మేం అనాథలం,'' అన్నది.

రాము ముందరికి వెళ్ళి, ''అమ్మా, ఇతను నిజంగా నీ కొడుకే. దైవానుగ్రహం వల్ల తిరిగి బతికాడు. నా మాట నమ్ము,'' అన్నాడు.

గ్రామస్థులు రాముతో, ''నీ మాట ఎలా నమ్మటం? రాత్రి శవాన్ని పిశాచాలు తినటం మేం కళ్ళారా చూశాం,'' అన్నారు.

''అమ్మా, నేను నీ శ్యామ్‌నే. తిరిగి బతికాను. నన్ను మీతో ఉండనియ్యండి. వెళ్ళగొట్టకండి,'' అని ఎంత బతిమాలినా శ్యామ్ పట్ల అతని తల్లి మూఢ హృదయం ద్రవించలేదు.

అప్పటికి కొందరు గ్రామస్థులు అక్కడ చేరారు, కాని కాస్త దూరంగా నిలబడ్డారు. వారిలో గ్రామ పెద్ద తారినీ కూడా ఉన్నాడు. శ్యామ్ ఆయనతో తాను బతికే ఉన్నాననీ తన వాళ్ళతో కలిసి జీవించేటట్టు చేయమనీ ప్రాధేయపడుతూ అన్నాడు.

''నిన్ను పిశాచం ఆవహించలేదని ఏమిటి? తప్పకుండా పిశాచమే ఆవ

హించింది. చచ్చిన వాడు తిరిగి బతకటం ఎక్కడైనా కద్దా ?" అన్నాడు తారినీ.

ఈపాటికి శ్యామ్ ఇంట్లో వాళ్ళంతా వసారాలోకి వచ్చి నిలబడి, శ్యామ్ కేసి వింతగా చూస్తున్నారు.

రాము గ్రామస్థులతో వాదించటానికి పూనుకున్నాడు. అతను గంభీరంగా ఇలా అన్నాడు :

"ఒకవేళ శ్యామ్‌ను దయ్యమో, భూతమో, పిశాచమో ఆవహించినప్పటికీ వచ్చిన నష్టం ఏమీ లేదు. నేను తాంత్రికాచార్యుణ్ణి. ఎలాటి గాలినీ పార దోలగలను. అయితే, శ్యామ్ ఉత్త కళేబరమనీ, అందులో ఏదో భూతం చేరి ఆడిస్తున్నదనీ మీ అనుమానమైతే, అది అబద్ధమని ఈ క్షణంలోనే రుజువు చేయగలను. శవం నుంచి రక్తం రాదని మీకు తెలుసు. శ్యామ్ వంటి నుంచి రక్తం వస్తే అతని శరీరం శవం కాదన్నమాటే".

రాము శ్యామ్ కాళ్ళ దగ్గిర కూచుని, పాము కరిచిన చోట గడ్డకట్టిన రక్తం తీసేసి, పాదాన్ని నొక్కాడు. రక్తం బొట్టు బయటికి వచ్చింది.

"కనక ఇతను బతికున్న మనిషే! పోతే, ఇతన్ని ఏ పిశాచమైనా ఆవహించిందా అన్న విషయం నాకూ కూడా కొంత సందేహం లేకపోలేదు. అందుకని కొంత




కర్మకాండ జరుపుదామనుకుంటున్నాను. అందుకు రేపు శనివారం దివ్యమైన రోజు. అంతదాకా శ్యామ్ నా సంరక్షణలోనే మీ ఊరి శివాలయంలో ఉంటాడు," అన్నాడు రాము గ్రామపెద్దతో.

ఇందుకు గ్రామపెద్దతో సహా గ్రామస్థులంతా అంగీకరించారు.

రాము శ్యామ్‌ను వెంటబెట్టుకుని సమీపంలో గల బస్తీకి వెళ్ళి, రేపటికి కావలిసిన సామగ్రి—కుండలూ, ఎండు గడ్డి, కంబళీలాటివి కాక, రహస్యంగా మందుల షాపులో టింక్చర్ అయొడీన్, ఫొటో సామానులు అమ్మే షాపులో హైపో పలుకులూ కొన్నాడు. అతను ఒక

తెల్ల గుడ్డముక్కను టించ్చర్ అయొడీన్‌లో పుల్లల సహాయంతో, తన చెయ్యికి రంగు కాకుండా, ముంచి, తరవాత ఆ గుడ్డ ముక్కను ఆరబెట్టాడు. అది నల్లగా అయింది. తరవాత ఒక కుండలో నీరు పోసి, అందులో హైపో పలుకులు కరగ నిచ్చాడు. ఇదంతా చాలా రహస్యంగా జరిగింది.

మర్నాడు శ్యామ్‌కు పట్టిన భూతాన్ని వదిలించే తంతు శ్యామ్ ఇంటనే ప్రారంభ మయింది. శ్యామ్‌ను ఆవరణ మధ్యలో కూర్చోబెట్టారు. అతని సమీపంలో రెండు నీటి కుండలు ఉంచారు. వాటిలో ఒకటి హైపో కరిగించిన నీరు గలది. రాము శ్యామ్‌కు ఎదురుగా కూర్చుని మంత్రాలు చదివాడు. అలా ఒక గంటసేపు చదివి రాము లేచి నిలబడి, "ఇప్పుడు కుండలలో నీరు మంత్రజలం. దాని శక్తి పరీక్షింతాం. ఈ మంత్రజలం ఎటు వంటి కల్మషాన్నయినా విరగగొట్టి, శుద్ధి చెయ్యగలదు," అన్నాడు.

అతను శ్యామ్ దుస్తులలో దాచి ఉంచిన నల్లని గుడ్డ ముక్క పైకి తీసి, ఒక గ్లాసు అడిగి తీసుకుని, దాన్ని హైపో నీరు గల చిన్న కుండలో ముంచి, ఆ నీటి లోకి నల్ల గుడ్డ ముక్కను నింపాదిగా దించాడు. గుడ్డ నలుపు విరిగిపోయి, తెల్లని తెలుపు రంగుకు మారటంతో జలానికి గల మంత్రప్రభావం అందరికీ స్పష్టంగా తెలిసింది.

"చూశారుగదా, మంత్రజలం మహిమ! దీనితో శ్యామ్‌ను స్నానం చేయించామంటే అతను శుద్ధి పొందుతాడు," అంటూ రాము పెద్ద కుండలోని మామూలు నీటితో శ్యామ్‌ను స్నానం చేయించాడు.

ఇది జరిగిన తరవాత శ్యామ్‌ను మామూలు మనిషి కింద అందరూ ఆమోదించారు.

మందుల షాపులోనూ, ఫొటోగ్రాఫరు కిందా పనిచేసి ఉండటం చేత అయొడీన్ మరకలను హైపో విరిచేస్తుందని రాము ఎరుగును.





# ప్రశాంత జీవనం

పూర్వం ఒక గ్రామంలో గోవిందయ్యా అనే ధనవంతు డుండేవాడు. ఆయనకు అరవై ఏళ్ళు వచ్చేసరికి తన వాళ్ళంటూ ఎవరూ లేకుండాపోయారు. ఆయన విరక్తి పుట్టి, తనకున్నదంతా గ్రామం యొక్క బాగుకు ధారపోసి, ప్రశాంతంగా తన మిగిలిన జీవితం వెళ్ళబుచ్చటానికి వనాలకు వెళ్ళిపోయాడు.

అరణ్య మధ్యంలో నీటి వనరులకు దగ్గిరలో ఒక కుటీరం నిర్మించుకుని, కాయలూ, పళ్ళూ, కంద మూలాలూ తిని బతుకుతూ ఆయన ప్రశాంతంగా జీవించసాగాడు.

ఇంతలో ఒకనాడు ఒక వింత సంఘటన జరిగింది. గోవిందయ్యా పొదలలో ఏవో కాయలు కోసుకుంటూండగా ఒక పెద్ద పులి ఆయన వెనకగా, దాదాపు ఆయనను రాచుకుంటూ వెళ్ళిపోయింది. అంతకు ముందే దాని గాండ్రింపు విని చెట్టెక్కిన కట్టెలు కొట్టేవాడు ఇది చూశాడు. కాని గోవిందయ్యాకు మాత్రం తన వెనకగా పులి వెళ్లిన సంగతి తెలియదు.

కట్టెలు కొట్టేవాడు గోవిందయ్యా మామూలు మనిషి కాదని నిశ్చయించుకుని, చెట్టు దిగివచ్చి, గోవిందయ్యా కాళ్ల మీద పడి, ''పెద్ద కుటుంబం గలవాణ్ణి. సంసారం ఈదలేక చస్తున్నాను. తరించే మార్గం చెప్పండి, స్వామీ!'' అన్నాడు దీనంగా.

గోవిందయ్యా వాణ్ణి లేవనెత్తి, "నీ కష్టం నువు చెయ్యి. తరించటం మాట నీకెందుకు?'' అన్నాడు.

ఆ కట్టెలు కొట్టేవాడు సమీపంలో ఉన్న తన గ్రామానికి వెళ్లి, గోవిందయ్యా గురించి అద్భుతంగా చెప్పాడు. అది మొదలు జనం అరణ్యంలో ఉన్న

ఎమ్. వి. వి. సత్యనారాయణ



గోవిందయ్య దర్శనం చేసుకుని పాపాలు పోగొట్టుకోవటానికి రాసాగారు. రాను రాను అది తీర్థప్రజ అయింది.

ప్రశాంతంగా జీవింతామనుకున్న గోవిందయ్యకు ప్రజల కష్టాలూ, సమస్యలూ, ఈతి బాధలూ వినక తప్పలేదు. జనం అతన్ని గోవిందస్వామిని చేసి, దేవుడులాగా పూజించసాగారు. క్రమంగా అతని పేరు ఇంకా, ఇంకా దూర గ్రామాలకు పాకింది.

ఒకసారి బహు దూర గ్రామం నుంచి సుందరయ్యా, కాంతమ్మా అనే బీద రైతు దంపతులు గోవిందస్వామి దర్శనం చేసుకోవాలని బయలుదేరారు.

వారు కొంతదూరం వెళ్ళేసరికి, యాత్రికుల వేషంలో పోతున్న కొందరు దొంగలు వారికి తగిలారు. సుందరయ్య అవతారమూ, బవిరి గడ్డమూ చూసి దొంగలకు ఒక ఆలోచన వచ్చింది. ఆకలితో అలమటిస్తున్న సుందరయ్యకూ, కాంతమ్మకూ వాళ్ళు తమ వద్ద ఉన్న తిండి పెట్టి, వాళ్ళకు తమ సంచీలలో నుంచి కాషాయవస్త్రాలు తీసి కట్టబెట్టారు. తరవాత తాము కూడా కాషాయవస్త్రాలు ధరించారు.

తరవాత దొంగలు ఆ అడవి ప్రాంతంలోనే ఒక చిన్న ఆశ్రమం నిర్మించి, సుందరయ్యను అందులో గోవిందస్వామి ప్రియ శిష్యుడిగా ప్రతిష్ఠించారు; అతను అభ్యంతరం చెబితే చంపేస్తామన్నారు; తాము అతని శిష్యులలాగా నటిస్తూ, తమ కొత్త స్వామి గురించి చుట్టుపక్కల గ్రామాలకు పోయి ప్రచారం చేశారు.

సుందరయ్య ఆశ్రమానికి గోవిందయ్య ఆశ్రమం చాలా దూరం. అందుచేత గోవిందస్వామి దర్శనం చేసుకునేటందుకు పోలేనివారు, ఈ చిన్న గోవిందస్వామిని చూడవచ్చారు. దొంగలు సుందరయ్యకు కొన్ని ఇంద్రజాల విద్యలు నేర్పారు. అతను ఉత్త చేతులు రుద్దుకుని

బూడిద తెప్పించేవాడు, నోట్లో నుంచి శివ లింగాలు తీసేవాడు. ఈ గమ్మత్తులు చూసి భక్తులు పరవశించిపోయి, చిన్న గోవిందస్వామికి కానుకలు అర్పిస్తే, వాటిని దొంగలు తీసుకునేవారు. వాళ్లకు యీ రకం వృత్తి, దారిదోపిళ్ళకన్న గిట్టుబాటుగానూ, చాలా గౌరవప్రదంగానూ ఉన్నది.

రాను రాను అసలు గోవిందస్వామి కన్న చిన్న గోవిందస్వామే మహిమలు గలవాడని వాడుక పడింది. అరణ్యంలో మరీ దూరాన ఉన్న గోవిందయ్యకు భక్తులు తగ్గి, సమీపంలో ఉన్న సుందరయ్యకు హెచ్చారు.

తన పేరు ఉపయోగించుకుని ఎవరో జనాన్ని మోసగిస్తున్నారని గోవిందయ్యకు అనుమానం కలిగింది. తాను "స్వామి" అయిన మాట నిజమేగాని, ఎవరినీ ఎన్నడూ ఏ విధంగానూ మోసం చెయ్యలేదు. ఈ కొత్త స్వామి ఎవరు?

అది తెలుసుకుందామని గోవిందయ్య సుందరయ్య ఆశ్రమానికి బయలుదేరాడు. అతను ఎవరైనదీ తెలియని దొంగలు అతన్ని ఇతర భక్తులను ఆదరించినట్టే ఆదరించారు.

సుందరయ్య తన మహత్తులు ప్రదర్శించగానే చూడవచ్చిన భక్తులు వెళ్ళి



పోయారు. దొంగల అనుమతి మీద గోవిందయ్య సుందరయ్యతో ఒంటరిగా కొంతసేపు మాట్లాడాడు. సుందరయ్య స్వామి హోదాలోనే అతని ప్రశ్నలకు జవాబు చెప్పాడు.

"తమ గురువుగారైన గోవిందస్వామి గారిని గురించి తెలుసుకోవాలని ఉన్నది. మీకు తెలిసినది చెప్పండి," అన్నాడు గోవిందయ్య.

"నాయనా, వారిని గురించి నేను ఏమి చెప్పగలను? వారు గొప్ప తపస్సంపన్నులు! దైవసాక్షాత్కారం పొందిన జ్ఞానులు!" అన్నాడు సుందరయ్య పరవశంగా కళ్ళు మూసుకుని.

"వారి పూర్వనామం ఏమై వుంటుందో తమకు తెలుసా?" అని గోవిందయ్య మళ్ళీ అడిగాడు.

"పిచ్చివాడా! వారికి పూర్వనామం ఏమిటి? వారు పుట్టుతూండగానే అశరీర వాణి 'గోవిందస్వామి!' అని పలికింది," అన్నాడు సుందరయ్య.

"ఆ స్వామి వారిని తమరు ఎంత కాలం క్రితం చూశారు?" అని గోవిందయ్య అడిగాడు.

"నే నెప్పుడు తలుచుకుంటే అప్పుడు వారి దివ్యవిగ్రహం దర్శనమిస్తుంది!" అన్నాడు సుందరయ్య.

"అలా అయితే నన్ను గుర్తుపట్టావా!" అన్నాడు గోవిందయ్య.

"నువు ఎవరు, నాయనా?" అని సుందరయ్య అడిగాడు.

"ఇప్పుడు మీరు కీర్తిస్తున్న గోవింద స్వామిని, స్వామీ!" అన్నాడు గోవిందయ్య. అది విని సుందరయ్య నిర్ఘాంత పోయాడు.

"ఇంద్రజాల విద్యలతో జనాన్ని ఎందుకు ఇలా మోసం చేస్తున్నారు?" అని గోవిందయ్య అడిగాడు.

దొంగలు తనను అడ్డం పెట్టుకుని జనాన్ని ఎలా మోసం చేస్తున్నదీ సుందరయ్య వివరంగా చెప్పాడు. దొంగల నుంచి తప్పించుకు పారిపోవటానికి తనకు అభ్యంతరం లేదని కూడా అతను గోవిందయ్యకు స్పష్టం చేశాడు.

ఆ రాత్రి దొంగలు మత్తు నిద్రలో ఉన్న సమయంలో గోవిందయ్య సుందరయ్యనూ, అతని భార్యనూ తీసుకుని బయలుదేరాడు. వాళ్ళు చాలాదూరం ప్రయాణంచేసి, ఒక పట్టణం చేరుకుని, మామూలు పనులు చేసుకుంటూ బతకసాగారు.

నట్టడవిలో దొరకని మనశ్శాంతి గోవిందయ్యకు జనసమ్మర్దంగల పట్టణంలో దొరికింది. ఎందుకంటే అక్కడ అతన్ని ఎరిగినవారూ, అతని సంగతి పట్టించుకునేవారూ లేరు.





# వీర హనుమాన్

సూర్యోదయం అయేవేళ వానరసేనకూ, రాక్షససేనకూ యుద్ధం ఆరంభమయింది. మామూలు ప్రకారమే రాక్షసులు వానరుల మీద బాణాలూ, పరిఘలూ, ఖడ్గాలూ, పరశువులూ ప్రయోగిస్తే, వానరులు రాక్షసుల మీద చెట్లూ, గండశిలలూ ప్రయోగించారు. ఇరు పక్షాలా రక్తం కాలవలుగట్టి పారి, లేస్తున్న దుమ్మును అణచివేసింది.

రాక్షసుల తాకిడికి తట్టుకోలేకుండా ఉన్న వానరసేనలకు అండగా రాముడు విల్లు చేతబట్టి, రాక్షస సైన్యాలలో ప్రవేశించి, నిప్పులాటి బాణాలను రాక్షసుల మీద వర్షంలాగా కురిపించసాగాడు. రాముడి దెబ్బకు రాక్షసులు తట్టుకోలేక పోయారు. అతని బాణ ప్రయోగం వారికి తెలిసేది కాదు, దాని ఫలితం మాత్రమే తెలిసేది. చెట్లు ఊగిపోవటం కనిపిస్తుంది గాని, ఝంఝామారుతం కనిపించదు గదా! క్షణాల మీద అంతులేని రాక్షస సంహారం జరిగింది.

రాముడు తనకు సమీపంగా ఉన్న సుగ్రీవ, విభీషణ, జాంబవంత, హనుమంతాదులతో, "నాలాగా బాణాలు ప్రయోగించటం ఒక్క శివుడికి తప్ప మరెవరికీ తెలియదు," అన్నాడు.

యుద్ధరంగంలో జరుగుతున్న రాక్షస హత్యాకాండ లంకలో రాక్షస స్త్రీలకు తెలిసింది. చచ్చిన వారిలో అనేకమంది భర్తలు ఉన్నారు, కొడుకులున్నారు.

**34. రాముడికి దేవేంద్రుడి సహాయం**



వాళ్ళు పెద్దపెట్టున ఏడుస్తూ, ఈ పీడ కంతటికీ మూల కారకురాలైన శూర్పణఖను తిట్టుకున్నారు. ఆ పాపిష్ఠిది వెళ్ళి రాముణ్ణి మోహించటమేమిటి? ఆ శూర్పణఖ మాటలు విని రావణుడు సీతను ఎత్తుకువచ్చి, రాముడితో ఈ విరోధం తెచ్చుకోవటమేమిటి? పోనీ ఆ సీత రావణుడికి స్వాధీనమయిందా అంటే అదీ లేదు! సీతను ఎత్తుకు పోవటానికి ప్రయత్నించిన విరాధుడు రాముడి చేతిలో చచ్చాడు కాదా? నిశ్చయంగా రాముడే గెలుస్తాడు. రాముడి శక్తి రావణుడికి మాత్రమే ఇంకా తెలియకుండా ఉన్నది! ఇట్లా అనుకుంటూ రాక్షస స్త్రీలు తమ మొగుళ్ళు చచ్చినందుకూ, సోదరులు చచ్చినందుకూ, కొడుకులు చచ్చినందుకూ శోకాలు పెట్టారు.

ఒకవంక రాముడు తన రాక్షససేనను కార్చిచ్చులాగా దహిస్తుంటే, రావణుడు తన సమీపాన ఉన్న మహోదర, మహాపార్శ్వ, విరూపాక్షులతో, "ఖరుణ్ణీ, కుంభకర్ణుణ్ణీ, ప్రహస్తుణ్ణీ, ఇంద్రజిత్తునూ చంపిన శత్రువును ఇప్పుడు నిర్మూలిస్తాను! నా బాణాలు భూమ్యాకాశాలను అంధకారంలో ముంచేస్తాయి. వానర సేనను గుంపులు గుంపులుగా వధిస్తాను," అంటూ ప్రగల్భాలు పలికాడు.

రావణుడు ఎక్కి ఉన్న రథానికి ఎనిమిది గుర్రాలు పూన్చి ఉన్నాయి. దానిమీద రావణుడు భయంకరమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. అతని వెంట రథాల మీద మహాపార్శ్వుడూ, మహోదరుడూ, విరూపాక్షుడూ ఉన్నారు. రావణుడు వానర సేనలో జొరబడి, భయంకరమైన యుద్ధం చేశాడు.

రాముడు రాక్షస సేనలో ఎలాటి విధ్వంసం సాగించాడో, రావణుడు వానర సేనలో అలాటి విధ్వంసమే చేశాడు. అది చూసి సుగ్రీవుడు, వానరసేనను కాపాడే భారం సుషేణుడికి అప్పగించి,

తాను భయంకరమైన యుద్ధం చేయటానికి పూనుకుని, భీకరంగా అరుస్తూ, అనేకమంది మామూలు రాక్షసులను చంపి, రాక్షస వీరులను చంపటానికి సిద్ధపడ్డాడు.

ఇది చూసిన విరూపాక్షుడు రథం మీది నుంచి సమీపంలో ఉన్న ఏనుగు మీదికి ఎగిరి కూర్చుని, వానరసేనను ప్రవేశించాడు. వానరసేనా ముఖంలోనే అతనికి సుగ్రీవుడు తగిలాడు. విరూపాక్షుడు బాణాలతో సుగ్రీవుణ్ణి బాధించాడు. విరూపాక్షుణ్ణి చంప నిశ్చయించి, సుగ్రీవుడు ఒక పెద్ద చెట్టు పెరికి విరూపాక్షుడు ఎక్కిన ఏనుగు ముఖం మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు ఏనుగు వెనక్కు తుళ్ళి, చచ్చిపడిపోయింది. విరూపాక్షుడు చచ్చిన ఏనుగు మీది నుంచి దిగి, కత్తీ, డాలూ తీసుకుని, సుగ్రీవుణ్ణి కత్తితో బలంగా కొట్టాడు. తరవాత ఇద్దరికీ సమంగా గొప్ప యుద్ధం జరిగింది. చిట్టచివరకు సుగ్రీవుడు విజృంభించి విరూపాక్షుడి చేత ముక్కులా, నోటా నెత్తురుకక్కేలాగ కొట్టి, అతన్ని చంపేశాడు.

విరూపాక్షుడు పోగానే అతని స్థానంలో వానర సేనను నిర్మూలించటానికి రావణుడు మహోదరుణ్ణి నియమించాడు. మహోదరుడు వానర సేనను చంపుతూ వస్తూంటే సుగ్రీవుడు అడ్డుపడి, ఒక పరిఘ సంపాదించి, దానితో మహోదరుడి రథాశ్వాలను చంపాడు. మహోదరుడు కోపంతోవణికిపోతూ, వెంటనే రథం దిగి, గద చేతబట్టి, సుగ్రీవుడిపై తలపడ్డాడు.



త్వరలోనే సుగ్రీవుడి చేతి పరిఘా, మహోదరుడి గదా విరిగిపోయాయి. తరవాత ఇద్దరూ ముష్టి యుద్ధానికి దిగారు. కొంతసేపటికి ఇద్దరూ అలిసిపోయి, యుద్ధభూమిలో దొరికిన ఆయుధాలు తీసుకుని పోరాటం సాగించారు. ఇంతలో మహోదరుడి చెతి కత్తి, సుగ్రీవుడి చేతి



డాలులో గుచ్చుకున్నది. దాన్ని అతను లాగుతూండగా సుగ్రీవుడు అతని తల కాస్తా నరికేశాడు.

ఈ సమయానికి మహాపార్శ్వుడు అంగదుడి సేన మీద విరుచుకుపడి, దాన్ని ధ్వంసం చెయ్యసాగాడు. అంగదుడు మండిపడి, బంగారు కట్ల ఇనుప గుదియను విసిరాడు. ఆ దెబ్బకు విరూపాక్షుడూ, అతని సారథీ కూడా స్పృహ తప్పి కిందపడ్డారు. అదే సమయంలో గవాక్షుడూ, జాంబవంతుడూ అక్కడికి వచ్చి, పెద్ద శిలలతో మహాపార్శ్వుడి రథాన్ని నుగ్గు చేశారు, గుర్రాలను చంపారు.

ఇంతలో మహాపార్శ్వుడికి స్పృహ తెలిసి, గవాక్షుణ్ణీ, జాంబవంతుణ్ణీ బాణాలతో కొట్టనారంభించాడు. అది చూసి అంగదుడు ఉగ్రుడై, దూరం నుంచి ఒక పరిఘను విసిరి, వెంటనే సమీపంగా వచ్చి, కొంతసేపు యుద్ధంచేసి, చివరకు మహాపార్శ్వుడి గుండెలో పిడికిలితో పొడిచి, చంపేశాడు.

ఇక రావణుడు తానే యుద్ధభారం వహించదలచాడు. అతను ఇతర వానర వీరులతో యుద్ధం చెయ్యదలచలేదు. అందరికీ మూలకందమైన రాముణ్ణే చంప నిశ్చయించాడు. అతను రాముడి కేసి వెళుతూ, తామసాస్త్రం వానరసేన మీద ప్రయోగించాడు. అది ప్రచండమైన అస్త్రం. దాని తాకిడికి వానరులు అమితంగా దెబ్బతిన్నారు. వారు భయపడి చెల్లాచెదరై పారిపోయి రావటం చూసి రాముడు యుద్ధసన్నద్ధుడై, ముందుకు వచ్చాడు. అతని వెంట లక్ష్మణుడు కూడా ఉన్నాడు.

రావణుడిపై మొదట విల్లెత్తి బాణాలు వేసినవాడు లక్ష్మణుడు. కాని రావణుడు అతని బాణాలన్నిటినీ దారిలోనే ఖండించి, రాముడి కేసి తిరిగి, అతని మీద బాణవర్షం కురిపించాడు. రాముడు వాటిని తన బాణాలతో ఖండించాడు. ఇద్దరికీ



చాలా సేపు ఘోరమైన యుద్ధం జరిగింది. ఒకరి అస్త్రాలను ఒకరు దారిలోనే ఖండించారు.

రావణుడు రాముడిపై అసురాస్త్రం ప్రయోగించాడు. అది మహా భయంకర మైనది. రాముడు ఆగ్నేయాస్త్రంతో దాన్ని ధ్వంసం చేశాడు. అది చూసి సుగ్రీవుడు మొదలైన వానర వీరులు చాలా సంతోషించారు.

తరవాత రావణుడు రౌద్రాస్త్రం ప్రయోగించాడు. రాముడు గాంధర్వాస్త్రంతో దాన్ని ధ్వంసం చేశాడు. రావణుడు సౌరాస్త్రం ప్రయోగించాడు. రాముడు దాన్ని కూడా ఖండించాడు.

తరవాత ఇద్దరూ మామూలు బాణాలతో యుద్ధం చేశారు. రాముడు రావణుణ్ణి తన బాణాలతో బాగా గాయపరచి, కొంత సేపు విశ్రాంతి తీసుకున్నాడు.

అప్పుడు లక్ష్మణుడు బాణాలు ఎక్కుపెట్టి, రావణుడి ధ్వజం విరగగొట్టాడు, రావణుడి సారధి తల నరికాడు, రావణుడి ధనుస్సును ముక్కలు, ముక్కలు చేశాడు.

లక్ష్మణుడు ఆగగానే విభీషణుడు రావణుడి రథాశ్వాలను తన గదతో కొట్టి చంపాడు. రావణుడు విభీషణుడిపై మండిపడి, రథం నుంచి నేలకు ఉరికి, విభీషణుడి మీద ఒక శక్తిని విసిరాడు. లక్ష్మణుడు ఆ శక్తిని మధ్య దారిలోనే తన బాణాలతో మూడుగా ఖండించాడు.

రావణుడు ఈ సారి ఇంకా దారుణమైన శక్తిని చేతపట్టాడు. లక్ష్మణుడు చప్పున విభీషణుడికి అడ్డం వెళ్ళాడు. రావణుడు ఆ శక్తిని విభీషణుడిపై విసిరే లోపల లక్ష్మణుడు రావణుణ్ణి బాణ వర్షంలో ముంచి ఎత్తాడు.

రావణుడు లక్ష్మణుడితో, "విభీషణుడికి అడ్డం వచ్చావు గనక ఈ శక్తిని నీ మీదే వేస్తాను. ఇది నీ ప్రాణాలు తీస్తుంది." అంటూ ఆ శక్తిని లక్ష్మణుడి మీదనే ప్రయోగించాడు.

రాముడు ఆ శక్తిని శపిస్తూ, "నువు వ్యర్థమగుదువుగాక!" అన్నాడు. అయినా అది సూటిగా లక్ష్మణుడి రొమ్ములో తాకింది. లక్ష్మణుడు పడిపోయాడు. శక్తి అతని శరీరంలోనుంచి ధూరి కింద పడింది. రాముడు కోపంతోనూ, దుఃఖంతోనూ ఆ శక్తిని తన చేతులతో విరిచాడు. ఆ సమయంలో రావణుడు అతని మీద విడవకుండా బాణాలు వేస్తూనే ఉన్నాడు. రాముడు వాటిని లక్ష్యపెట్టకుండా, లక్ష్మణుణ్ణి కౌగలించుకుని, హనుమంతుడూ, సుగ్రీవుడూ మొదలైన వానరులతో, "మీరు లక్ష్మణుణ్ణి చూస్తూ ఉండండి. ఇక రావణుణ్ణి వధించక తప్పదు," అన్నాడు.



కాని లక్ష్మణుడి స్థితి చూసి రాముడికి యుద్ధం చేసే అసక్తి కూడా తగ్గుతున్నది. ఇది తెలిసి సుషేణుడు రాముడితో, "లక్ష్మణుడి ప్రాణం పోలేదు. ఇతను బతికే ఉన్నాడు. నీకు విచారం వద్దు." అని హనుమంతుడితో, "నువు ముందు తెచ్చిన ఓషధీ పర్వతం దక్షిణ శిఖరం మీద ఉండే ఓషధిని పట్టుకురా. మనం లక్ష్మణుణ్ణి బతికించుకోవాలి," అన్నాడు.

హనుమంతుడు ఓషధీ పర్వతం వద్దకు వెళ్లాడుగాని, కావలసిన ఓషధిని పోల్చుకోలేక, పర్వతం యొక్క దక్షిణ శిఖరాన్నే ఏకంగా పట్టుకొచ్చాడు. అతను సుషేణుడితో, "నువు చెప్పిన ఓషధి నాకు తెలియలేదు. శిఖరమంతా పెల్లగించి తెచ్చాను. నీకు కావలిసిన ఓషధి నువే తీసుకో," అన్నాడు.

సుషేణుడు హనుమంతుడి పటుత్వాన్ని మెచ్చుకుంటూ ఓషధిని పైకి తీశాడు. తరవాత అతను దాని రసాన్ని లక్ష్మణుడి ముక్కులో పిండాడు. లక్ష్మణుడు వెంటనే బాధలన్నీ పోయి, స్పృహ వచ్చి, లేచి నిలబడ్డాడు.

రాముడు ఆనందబాష్పాలతో లక్ష్మణుణ్ణి కౌగలించుకుని, "లక్ష్మణా, నువు చచ్చి కూడా బతికావు. నువు

నిజంగా చచ్చిపోయి ఉంటే నాకు సీతతో ఏం పని? ఈ యుద్ధంతో ఏం పని? నా అదృష్టం కొద్దీ బతికావు." అన్నాడు.

"నువు ఇలా బలహీనుడిలాగా మాట్లాడరాదు. రావణుణ్ణి చంపి, విభీషణుణ్ణి లంకకు రాజును చేస్తానని ప్రమాణం చేశావు. నా కోసం నిరాశ మాని, రావణుణ్ణి చంపు. ఆ విధంగా విభీషణుడికి నువు చేసిన వాగ్దానం నెరవేర్చుకో. సూర్యుడు అస్తమించే లోపల రావణుడు చావాలని నేను కోరుతున్నాను," అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుడు ఇలా అనగానే రాముడు తన విల్లు ఎక్కుపెట్టి, రావణుడిపై బాణాలు ప్రయోగించాడు.

రామ రావణ యుద్ధంలో ఒక లోటు కనబడింది. రావణుడు రథం మీద ఉండి యుద్ధం చేస్తున్నాడు. రాముడు నేలమీద నిలబడి యుద్ధం చేస్తున్నాడు.

ఈ లోటు సరి చెయ్యటానికి ఇంద్రుడు తన సారథి అయిన మాతలి చేత తన రథాన్ని భూలోకానికి పంపాడు. దానికి బంగారు నగిషీలున్నాయి, అనేక గంటలున్నాయి, వైడూర్యంతో చేసిన నొగ ఉన్నది. అది ఉదయ సూర్యుడిలాగా వెలిగిపోతున్నది. మాతలి ఆ రథాన్ని తీసుకుని రాముడి వద్దకు వచ్చి, రాముడితో ఇలా అన్నాడు:

"రాముడా, నీకు విజయం కోరుతూ దేవేంద్రుడు ఈ రథాన్ని నీకు పంపాడు. దీనితోబాటు ఈ ఇంద్రధనుస్సునూ, కవచాన్నీ, బాణాలనూ, శక్తినీ ఇంద్రుడు నీకు ఇచ్చాడు. పూర్వం ఇంద్రుడు ఇదే రథం మీద, నేను సారథిగా పనిచేయగా, దానవులను చంపాడు. ఇప్పుడు నువు దీనిమీద ఎక్కి రావణుణ్ణి చంపు."

మాతలి మాటలు విని రాముడు ఆ రథానికి ప్రదక్షిణం చేసి, నమస్కరించి, దానిమీద ఎక్కాడు. అటుపైన రామ రావణులకు, చూసేవాళ్ళకు అద్భుతం అనిపించేటట్టుగా యుద్ధం జరిగింది.





# సంథాల్ తిరుగుబాటు

సుందర్‌బాన్ అనే ప్రాంతాన, గంగానది అనేక పాయలుగా చీలి, సముద్రంలో కలుస్తుంది. ఆ ప్రదేశమంతా ఒక మహారణ్యం. ఆ అరణ్యం సుప్రసిద్ధ మైన బెంగాల్ పులులకూ, నదులు భయంకరమైన మొసళ్లకూ ఉనికిపట్టు.



ఈ అరణ్యం నంథాలు లనే ఆది వాసులకు నివాసస్థానం. వాళ్ళు అరణ్యంలో అనేకమైన ప్రమాదాలను ధైర్యంగా ఎదుర్కొంటూ, జీవయాత్ర సాగించేవారు. నంథాల్ పరగణా అని పిలవబడే ప్రాంతంనుంచి, వీర్‌భూమ్ వరకూ, వాళ్ళు స్థిరనివాసాలు ఏర్పరచుకున్నారు.



1838 సంవత్సరం వరకూ, యీ నంథాలులు తాము సేద్యం చేసే భూమికి, రెండువేల రూపాయిల పన్ను చెల్లిస్తూండేవాళ్ళు. కాని, ఇంగ్లీసు వాళ్ళు ఈస్టిండియా కంపెనీ పేరుతో అధికారాన్ని కైవశం చేసు కున్న తరవాత, యీ పన్ను నలభై నాలుగు వేల రూపాయిలకు పెంచ బడింది. పన్ను చెల్లించలేని నంథాలు లను భూస్వాములూ, పోలీసులూ ఏకమై, నానా చిత్రహింసలకూ గురి చేసేవాళ్లు.



ఈ దురన్యాయాలను సహించలేక సంథాలులు తిరుగుబాటుకు సిద్ధమయారు. **1857** వ సంవత్సరంలో జరిగిన సిపాయి తిరుగుబాటుకు రెండు సంవత్సరాల ముందు, సంథాలులు దేవుడి ఆధిపత్యాన్ని తప్ప, మరెవరి ఆధిపత్యాన్నీ గుర్తించమని చాటించి, కంపెనీ వాళ్ళ ఆఫీసులు తగులబెట్టి, తాము సర్వస్వతంత్రులమని ప్రకటించుకున్నారు.



ఈస్టిండియా కంపెనీ వాళ్ళ సైనికులు సంథాలులుండే అరణ్యప్రాంతాలను ముట్టడించారు. కాని, సంథాలులు నివసించే గ్రామాలను కనిపెట్టటం తేలికగాదు. సైనికులు ఎత్తయిన చెట్లెక్కి, అరణ్యంలో ఎక్కడ పొగ కనిపిస్తే, అక్కడ సంథాలులున్నారని పసికట్టి, గ్రామాలమీద పోయి పడేవాళ్లు.



సంథాలులను భయవిహ్వలులను చేసేందుకు కంపెనీ సైనికులు ఒక క్రూరమైన పద్ధతిని అవలంబించారు. మచ్చిక చేసిన ఏనుగులను, మద్యంతో కైపెక్కించి, వాటిని గుంపుగా సంథాలుల గ్రామాల మీదికి తరిమేవాళ్ళు. సమయానికి గ్రామం వదిలి పారిపోలేని స్త్రీలూ, పిల్లలూ ఏనుగుల కాళ్ళ కింద పడి దారుణమరణాలకు గురయేవారు.

తిరుగుబాటు చేసిన సంథాలులు విల్లంబులతో సైనికులను ఎదుర్కొన్నారు. శత్రువుకు వెన్ను చూపరాదనేది వాళ్ళు పాటించే కఠిన నియమం. కంపెనీ సైనికుల తుపాకీ గుళ్ళ ముందు, సంథాలుల బాణాలు నిరుపయోగమయినై. వాళ్ళు వందల సంఖ్యలో మరణించారు.





ఆఖరుకు సైనికులు, సంథాలుల ప్రధాన కేంద్రమైన గ్రామాన్ని ముట్టడించారు. అక్కడ వున్న ఒక ఇంటి గోడల కంతల నుంచి వందలాది బాణాలు వచ్చి, చాలామంది సైనికుల ప్రాణాలు బలిగొన్నవి.



చివరకు సైనికులు ఆ ఇంటి పరిసరాల్లో వున్న చెట్లెక్కి, అక్కడి నుంచి ఇంటి మీదికి తుపాకీ గుండ్లను ప్రయోగించసాగారు. దానికి జవాబుగా ఇంటి లోపలి నుంచి రివ్వుమంటూ బాణాలు వచ్చి, వాళ్ళను తాకసాగినై.



సైనికులు ఆ విధంగా వందల, వేల సంఖ్యలో ఆ ఇంటి మీదికి తుపాకి గుండ్లను పేల్చారు. క్రమంగా ఇంటి వైపునుంచి వాళ్ళమీదికి వచ్చే బాణాల సంఖ్య తగ్గి, చివరకు ఒకే ఒక బాణం వెలువడుతూ వాళ్ళ తుపాకీ గుండ్లకు జవాబివ్వసాగింది. సైనికులు చెట్లు దిగి, ఇంటిని చుట్టుముట్టి, "లొంగి పొండి!" అంటూ అరవసాగారు.

మరి కొద్ది క్షణాలు గడిచేసరికి, ఇంటి నుంచి వచ్చే ఆ ఒక్క బాణం కూడా ఆగిపోయింది. లోపల నిశ్శబ్దం. సైనికులు తలుపులు బద్దలు కొట్టి లోపల ప్రవేశించారు. అక్కడ చాలా మంది సంథాలులు చచ్చిపడి వున్నారు; కొందరు తీవ్రంగా గాయపడి మరణ దశలో వున్నారు. కాని, వాళ్ళ మధ్య ఒక వృద్ధ సంథాలు నిలబడి వున్నాడు. అతడి ఎడమ చేయి తుపాకీ గుండు దెబ్బకు గాయపడి వున్నది.





సైనికులు అతణ్ణి బంధించేందుకు ముందుకురికారు. కాని, వృద్ధ సంథాల్ చప్పున కత్తి తీసుకుని, అందిన వాళ్లను అందినట్లు నరకసాగాడు. సైనికులు హాహాకారాలు చేస్తూ బయిటికి పారిపోయి, దూరం నుంచి అతణ్ణి తుపాకులతో కాల్చి చంపారు.

ఈ విధంగా సంథాలుల తిరుగుబాటు అతి క్రూరంగా అణచబడింది. కాని, ఆ తిరుగుబాటు భారతస్వాతంత్ర్య పోరాటంలో అతి ముఖ్యమైన ఘట్టాల్లో ఒకటిగా నిలిచిపోయింది.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

?

ఒక జమీందారు దగ్గిర పశులకాపరి కుర్రవాడు ఒకడు ఉండేవాడు. ఒకరోజు ఒక గంధర్వుడు వాడి సహాయం పొంది, వాడికి చిటికవేస్తే బంగారుకణిక పడే శక్తి, నెత్తిన పెట్టుకుంటే అదృశ్యం చేసే టోపీ ఇచ్చాడు.

పశులకాపరి కుర్రాడు ఒక రాత్రి అంతా కూర్చుని సంచీడు బంగారం చేశాడు. దాన్ని ఎవరి కియ్యాలా అని ఆలోచిస్తే వాడికి జమీందారు కూతురు జ్ఞాపకం వచ్చింది. వాడికి చాలా కాలంగా ఆమె అంటే ప్రేమ.

మర్నాడు రాత్రి వాడు అదృశ్యంగా జమీందారు కూతురి గదికి వెళ్ళి, బంగారం సంచీ ఆమె మంచం దగ్గిరపెట్టి వచ్చాడు. ఇలా వారంరోజులు జరిగింది. ఆ బంగారం ఎవరు ఇస్తున్నదీ తెలుసుకోవటం ఎవరికీ సాధ్యం కాలేదు. డబ్బు లేక బాధపడుతున్న జమీందారు, ఆ మనిషి ఎవరో తెలిస్తే, వాడికి తన కూతుర్ని ఇద్దామని నిర్ణయించుకున్నాడు. కాని మనిషి జాడ తెలియకపోవటం చేత ఆ బంగారాన్ని ఎవరో దేవుడు ఇస్తున్నాడనుకున్నాడు.

ఇంతలో ఒకరోజు పశులకాపరి, బంగారపు సంచీ తీసుకుని, నెత్తిన టోపీ పెట్టుకోవటం మర్చిపోయి జమీందారు కూతురు గదికి వెళ్ళి, ఆమె మంచం పక్కన నిలబడ్డాడు. అప్పుడు వాణ్ణి నౌకర్లు పట్టుకుని, జమీందారుకు అప్పగించారు.

"ఏ దేవుడో ఇస్తున్న బంగారాన్ని కాజెయ్యాలనుకున్నావురా, దుర్మార్గుడా?" అని జమీందారు వాడి చేతులు రెండూ నరికించాడు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు జూలై 20లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 సెప్టెంబరు చందమామలో ప్రకటించబడతవి.

---

మే నెల పోటీ ఫలితం: గాలి మనుష్యులు—మనుష్యుల గాలి

గెలుపొందిన వారి పేరు: ఐ. రామకోటేశ్వరరావు, బరన్‌పేట, నరసరావుపేట

Telugu July. F—6 P. 61

## ఫోటో వ్యాఖ్యల పోటీ : . బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







K. P. A. Swamy P. G. Viswanathan

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జూలై నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నీళ్ళు వేసే చిన్నవాడు

రెండవ ఫోటో : నీళ్ళు పోసుకుంటున్నాడు

పంపినవారు : వి. మోహనరావు, శ్రీ గణేష్ కాటేజ్ ఇండస్ట్రీస్, సోంపేట.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# పార్లే క్రాక్‌జాక్ నాట్యం

"సరిగా...గా..గా ఉప్పప్పగా"

"తోం తరిగిణతోం తియతియ్యగా"

విడిగా
అమ్మబడవు—
అనుకరణలుంటాయి...
జాగ్రత్త!

తియ్యగా ఉప్పగా ఆ రుచి ఎంతో హాయ్ హాయ్
క్రాక్‌జాక్‌తో మజాగా కొట్టండి ఇకపై జై జై




క్రాక్‌జాక్ — తీపి ఉప్పూ-రెండు రుచులూగల ఒకే ఒక కమ్మటి బిస్కట్



వరల్డ్ సెలక్షన్
బహుమతి విజేత